# ఆంధ్రపత్రిక

317595






**The Andhra Patrika, Madras.** } Regd. No. M. 1118 Vol. 36 No. 236 TUESDAY 29th NOVEMBER 1949 వెల ఒకఅణా } Founder: K. NageswaraRao


# ఆంధ్రరాష్ట్రనిర్మాణం: కేంద్రప్రభుత్వలేఖ పైడిశెంబరు 6 న మంత్రివర్గచర్చ



నవంబరు 26 వ తేదీన రాజ్యాంగపరిషత్తు స్వతంత్రభారత రిపబ్లిక్ రాజ్యాంగాన్ని ఆమోదించిన అనంతరం రాజ్యాంగ శాసనం ప్రతిపై పరిషత్తు అధ్యక్షుడు డాక్టర్ రాజేంద్రప్రసాద్ గారు సంతకం చేస్తున్నారు.

## రాష్ట్రప్రధాని ప్రకటన

### విభజనవిధానమును ఢిల్లీఅధికారులే సూచించినట్లు విషయజ్ఞుల భావన

### జనవరి 26 లోగా ప్రత్యేకరాష్ట్రం ఏర్పడగలదని చెప్పలేనని కుమారస్వామిరాజాగారి వివరణ

మదరాసు, నవంబరు 28: ఆంధ్రరాష్ట్రనిర్మాణము సందర్భమున పరిశీలన నిమిత్తం కొన్ని సూచనలు చేయుచు మదరాసు ప్రభుత్వమునకు ఇండియాప్రభుత్వము పంపిన లేఖ అందినదని మదరాసు ప్రధాని శ్రీ పూసపాటి కుమారస్వామిరాజా నేడు అపరాహ్ణం విలేఖరులకు తెలిపిరి.

ఇండియా ప్రభుత్వమువారి సూచనలను డిసెంబరు 6 వ తేదీన జరుగనున్న మంత్రివర్గ సమావేశములో చర్చించెదమని కూడా ప్రధాని తెలిపిరి.

ఇండియా ప్రభుత్వమువారి లేఖ చాల దీర్ఘముగనూ, వివరములతో కూడినదిగను వున్నట్లు తెలియుచున్నది. ఆ లేఖలో ఇండియాప్రభుత్వము విభజనవిధానములను సూచించెననియు, ఆ సూచనలను పరిశీలించి అమలుజరుపుటకుగాను ఒకకమిటీ నియమించబడునని తెలియుచున్నది. ఈ కమిటీ శాసనసభ్యులతో కూడియుండుననీ మంత్రులువుంటే వుండవచ్చుననికూడా తెలియుచున్నది.

ఇండియా ప్రభుత్వము వారి లేఖలో "విభజన సంఘము" అనే మాటలు లేవని కూడ తెలియుచున్నది. మదరాసు ప్రభుత్వము ఫలానా గడువులోగా జవాబు ఇవ్వవలెనని లేదనియు అయితే సాధ్యమైనంత త్వరలో సమాధానము ఇవ్వవలెనని కోరినట్లు తెలియుచున్నది.

జనవరి 26 లోగా ఇండియా ప్రభుత్వము సూచించిన విధానమును పూర్తి చేయుటనుగురించి కూడ మంత్రివర్గసమావేశమున నియమించబడే సంఘము పరిశీలించి నిర్ణయించి విభజన వివరములకు పూనుకొనెదరని కూడ తెలియుచున్నది.

ఆంధ్రరాష్ట్రనిర్మాణమును గూర్చి మదరాసు ప్రభుత్వ ప్రధాని పూసపాటి కుమారస్వామిరాజాగారు నేటి మధ్యాహ్నం వంటిగంటకు పత్రికా ప్రతినిధులతో మాట్లాడుచూ రేపు తాము రాజపాళయం వెళ్లుచున్నామనిరి. మద్రాసు మంత్రివర్గ సమావేశము డిసెంబరు 6, 7 తేదీలలో జరుగగలదనియు, తేదీలలో కేంద్రప్రభుత్వ లేఖ చర్చింపబడుననిరి.

జనవరి 26 నకు ఆంధ్రప్రభుత్వము ప్రారంభమగునా అని అడుగగా ప్రధాని అది ఎటుల తెలుపగలమనిరి. ఉన్న రికార్డు పైన పంపకం కావలెననియు, రెండుశాసనసభల పార్టీలు కొత్తనాయకులను ఎన్నుకొని కొత్త మంత్రివర్గముల నేర్పరచుకొనవలసి ఉన్నదనియు, ఎవరెంత ఆత్రపడినను ఇది అంత తేలిగ్గా తేలునదికాదనిరి.

విభజనసంఘమును నియమింపవలసిన మంత్రివర్గము నియమించగలదనిరి. జనవరి

(2-వ పేజీ చూడుడు)

## హైదరాబాద్‌లోని ఆంధ్రప్రాంతాలను రాబోవు ఆంధ్రరాష్ట్రంలో చేర్చాలి

### సంస్థాననిమ్నజాతుల సంఘఅధ్యక్షుని సూచన

హైదరాబాదు, నవంబరు 27: ఇతరభాషారాష్ట్రాలు ఏర్పడినా, ఏర్పడకపోయినా హైదరాబాదులోని తెలుగుజిల్లాలను రాబోవు ఆంధ్రరాష్ట్రములో చేర్చివేయాలని వెనుకబడిన జాతుల సేవాసంఘాధ్యక్షుడు నేడు ఉద్ఘాటించారు.

సంస్థానంలో అధిక సంఖ్యాకులు విభజననే కోరుతున్నారని, విభజనవలన అనేక సాంఘిక-సాంస్కృతిక పరిపాలనా సమస్యలు తొలగిపోగలవని కూడా ఆయన అన్నారు. ఇది వెంటనే జరుగక పోతే ప్రజలలో నిరుత్సాహం ప్రబలి పోగలదని నెహ్రూ, పటేల్‌గార్లు ప్రజాభీష్టాన్ననుసరించి చర్యలు తీసుకోగలరని ఆశిస్తున్నాననీ కూడ ఆయన అన్నారు.

ఆంధ్రరాజధాని సమస్యపై మాట్లాడుతూ, ఈ విషయమై రెండుభిన్నాభిప్రాయాలున్నాయనీ, కొందరు హైదరాబాదు నగరాన్ని కేంద్ర ప్రభుత్వం పరిపాలించవలెనని కోరుతుండగా, మరి కొందరు దానిని ఆంధ్రరాజధానిగా చెయ్యాలని కోరుతున్నారని, ఈ రెంటికి మధ్యమార్గంగా హైదరాబాదునగరమును ఆంధ్రుల కిచ్చి, మిగతా బోలారం, త్రిమూల్ఘరీ, సికిందరాబాదులను భారత ప్రభుత్వం తీసుకోవాలనీ ఆయన సూచించారు.

(స్వ. వి.)

## నైరృతిఆఫ్రికాలో నీగ్రోరైతులపై హింసాకాండ

### దక్షిణాఫ్రికా "ధర్మకర్తృత్వ" ధోరణి: సమితికి రెవరెండ్ స్కాట్ వివరణ

న్యూయార్కు, నవంబరు 26: "నైరృతి ఆఫ్రికాలో నీగ్రో రైతులను పొలాలనుంచి వెడల నడపడానికి దక్షిణఆఫ్రికా విమానాలను బాంబులను ఉపయోగించినదని చెప్పడానికి తగినంత ఆధారం నా దగ్గర వున్నది," అని నేడు రివరెండు స్కాట్ ఐక్యరాజ్యసమితి ధర్మకర్తృత్వసంఘంలో ఉద్ఘాటించారు.

ఏ రాజకీయపక్షానికి గాని, వ్యవస్థకుగాని చెందని ఒకానొక వ్యక్తిని సమితి వినడం అంటూ జరగడం ఇదే ప్రథమం. ఇది సమితి చరిత్రలో అపూర్వం.

దక్షిణ ఆఫ్రికా ఈవిధంగా రైతులను పొలాల్లోంచి తోలడమే కాకుండా బాంబులు వేసి వారి గాలిమిల్లులను నాశనం చేసింది; పొలాలను పాడుచేసింది; పశువులను చంపింది; తోటలను తగలపెట్టింది. ఇళ్లను నిప్పు అంటించివేసిందనికూడా రివరెండ్ స్కాట్ ఈ సందర్భంలో చెప్పారు.

ఇటీవలనే బెచువానాలాండ్ సరిహద్దుల దగ్గర నీగ్రోలమీదకూడా బాంబులు ప్రయోగించిందని, చూపగలసాక్ష్యం తన దగ్గర వున్నట్లు ఆయన ప్రకటించారు.

దీనితో సరిపెట్టక అచ్చట నివసించే నీగ్రో తెగలవారి నందరిని పట్టి బానిసల క్రింద జమ కడుతూ చేసిన శాసనాలు కళ్లున్నవాళ్ళందరికీ కనపడుతునే వున్నాయి. అందువల్ల నేను నైరృతి ఆఫ్రికాను సమితి ధర్మకర్తృత్వంక్రింద వుంచవలసిందిగా అర్థిస్తున్నాను. తమతమ నెలవుల నుంచి వెడలనడపబడినవారి నందరిని తిరిగి రప్పించి, వారివారి నెలవుల్లో వారిని వుంచాలనికూడా కోరుతున్నాను అని రివరెండ్ స్కాట్ సూచించారు.

నైరృతి ఆఫ్రికా ప్రజలను ఇక్కడకు వచ్చి తమ కష్టాలను నివేదించుకొనే అవకాశం లేకుండా చేయుబడింది కాబట్టి వారి ప్రతినిధిగా తా నిచ్చటకు వచ్చానని రివరెండుస్కాట్ అన్నారు. సమితిపట్ల తమకు అపారనమ్మకంవున్నదని హిరో తెగవారు, ఇంకా ఇతర నీగ్రో జాతులవారు ఇచ్చట విన్నవించవలసిందిగా నన్ను కోరారు. దక్షిణ ఆఫ్రికా విషయంలో ఏదో తేల్చమందు తమ విషయాన్నిగూర్చి ఇచ్చట విన్నవించుకునే అవకాశం కల్పించవలసిందిగానూడా నాకు అర్థించుటకోరారు. అని అంటూ స్కాట్ ఇంకా అన్నారు.

బ్రిటిష్ ధర్మకర్తృత్వానికి, ప.ఆఫ్రికా

(2-వ పేజీ చూడుడు)

## జంషెడ్‌పూర్ ఉక్కు కర్మాగారంలో సమ్మె

కటక్, నవంబరు 28: జంషెడ్‌పూర్‌లో ఇండియన్‌స్టీల్ కర్మాగారంలో జరుగుతున్న సమ్మె విషయంలో బీహారు ప్రభుత్వం చేయిచేసుకోక పోవడాన్ని విమర్శిస్తూ, శ్రీ జయప్రకాశ్‌నారాయణ్ నేడొక ప్రకటన చేసారు.

శ్రీ జయప్రకాశ్‌నారాయణ్ ప్రస్తుతం ఒరిస్సాలో పర్యటిస్తున్నారు. ఈ ప్రకటనను ఆయన ఝేంద్రపారానుంచి జారీచేసారు.

ఇచ్చట ఈ కార్మికుల సంఘం సోషలిస్టుల చేతుల్లో వున్నది. కాబట్టి ప్రభుత్వం కలుగజేసుకోవడం లేదని ఒక ఆరోపణచేస్తూ, ఈ తగాదా మధ్యవర్తిత్వానికి పెట్టవలసిందని విజ్ఞప్తి చేసారు.

## తుపానుబాధితుల సహాయార్థం ఢిల్లీలో "ద్వారం" వారి కచేరీ

### నాయుడుగారికి అనంతశయనం అయ్యంగార్ స్వాగతం: రాజెన్‌బాబు ప్రశంస

న్యూఢిల్లీ, నవంబరు 27: ప్రఖ్యాతి దాక్షిణాత్యవాయులీన విద్వాంసులు, విజయనగరంలోని గానకళాశాల ప్రిన్సిపాలు అయిన ప్రొ॥ ద్వారం వెంకటస్వామి నాయుడుగారు, ఆంధ్రతుపాను బాధితుల సహాయార్థమున్నూ, ఆంధ్ర అసోసియేషను భవననిర్మాణార్థమున్నూ నేడిక్కడ గానకచేరీ చేశారు.

భారత రాజ్యాంగపరిషత్తు అధ్యక్షులు డా॥ రాజేంద్రప్రసాద్ ఈ సమావేశానికి అధ్యక్షత వహించారు. ఇందులో అనేక మంది రాజ్యాంగపరిషత్సభ్యులు, ప్రముఖ ఢిల్లీవాసులూ, అధికారులూ పాల్గొన్నారు.

డా॥ రాజేంద్రప్రసాదు ఈసందర్భంలో మాట్లాడుతూ, తనకు గానకళాపరిచయం విశేషంలేదనీ, అయినా మంచిసంగీతం తనకు సంతోషం కలిగిస్తుందనీ, ప్రొ॥ నాయుడుగారి నానందపరచేగానం ప్రజలను మరొకప్రపంచంలోకి తీసుకొనిపోగలదని అన్నారు.

రాజ్యాంగపరిషత్తు ఉపాధ్యక్షులు అనంతశయనం అయ్యంగారు నాయుడుగారికి స్వాగతపత్రం సమర్పించారు. నాలుగుగంటలసేపు నాయుడుగారు శ్రోతలను అమోఘమైన గానంవినిపించారనీ, వాయులీనంచేత మాట్లాడించినంతపని చేశారనీ అయ్యంగారు అన్నారు.

మంగళవారంనాటి సాయంకాలం శ్రీ ద్వారం వెంకటస్వామి నాయుడుగారు తుపానుబాధితులసహాయార్థం మరొక పాట కచేరీ చేస్తారు. ఆ సందర్భంలో పండిట్ జవహర్లాలు నెహ్రూ అధ్యక్షత వహిస్తారు.

### ఆంధ్రమహిళాసభ వసూళ్లు

మదరాసులోని ఆంధ్రమహిళా సభ

(2 వ పేజీ చూడుడు)

## తుపాను, వరదల దెబ్బతిన్న ఆంధ్ర జిల్లాల్లో మద్రాసుప్రధాని పర్యటన

విజయవాడ, నవంబరు 28: ఆంధ్రదేశంలో తుపానువల్ల, వరదలవల్ల సర్వనాశనమైన ప్రాంతాలలో, డిసెంబరు 8 నుండి 6 రోజులవరకూ మద్రాసు ప్రధాని పి. ఎస్. కుమారస్వామి రాజాగారు పర్యటిస్తారని నేడిక్కడ తెలిసినది.

ప్రధాని 7 వ తేదీన ఇక్కడికి మద్రాసునుండి వస్తారని, కృష్ణాజిల్లాలో 8, 9 వ తేదీల్లోను, తూర్పుగోదావరిలో 10, 11 తేదీల్లోను, పశ్చిమగోదావరిలో 12, 13 తేదీల్లోను పర్యటిస్తారని కూడా తెలిసింది. ఆయన 14 వ తేదీన మద్రాసుకు తిరిగి వెడతారు.

మద్రాసు ప్రధాని పి. ఎస్. కుమారస్వామి రాజాగారు డిసెంబరు 8 ఉదయం విజయవాడనుండి కృష్ణ కట్టమీదుగా అవనిగడ్డ వెడతారు. లంకలను పరీక్షించి, మధ్యాహ్నానికి బందరు చేరతారు. బందరునుండి బంటుమిల్లి, ముదినేపల్లి గ్రామాలు చూసుకొని రాత్రికి వడాలిలో మకాం చేస్తారు. 9 వ తేదీ ఉదయం కైకలూరు, గుడివాడ, పోలుకొండ, నందివాడ, కనుమూరులలో పర్యటించి రాత్రికి విజయవాడ చేరతారు. అక్కడనుండి తూర్పుగోదావరిజిల్లాకు ప్రయాణమౌతారు.

## తాత్కాలికంగా కూడా మద్రాసు ఆంధ్ర రాజధాని కాకూడదట

### కామరాజనాడార్ గారి ప్రకటన

న్యూఢిల్లీ, నవంబరు 27: ఇక్కడ కాంగ్రెసు కార్యవర్గ సమావేశానికి వచ్చిన తమిళకాంగ్రెసు సంఘాధ్యక్షులు కామరాజనాడారుగారు ఈ వేళ బయలుదేరి మదరాసు వెళ్లిపోయారు.

వీరు ఆంధ్రరాష్ట్ర నిర్మాణ విషయంలో పండితనెహ్రూను, వల్లభాయ్ పటేల్‌ను, గవర్నరుజనరలు రాజగోపాలాచారిని కలుసుకున్న తర్వాత ఈ క్రింది విధంగా ప్రకటించారు.

"ఆంధ్ర రాజధానివిషయంలో ఎంత త్వరగా నిర్ణయిస్తే అంత త్వరలో రాష్ట్ర విభజనకు వీలవుతుంది.

కాంగ్రెసు కార్యవర్గం ఆంధ్రరాష్ట్రం వెంటనే నిర్మించవలసిందని కేంద్రాన్ని కోరుతూ తీర్మానించింది. కేంద్రంకూడా ఈ తీర్మానం అంగీకరించింది. ఇక ఆంధ్రులు తమిళులు కలిసి సంప్రదించుకుని శీఘ్రంగా ఆంధ్రరాష్ట్రం నిర్మించాలి. ఇక ఇందులో కేంద్రానికి ప్రమేయం ఏమీలేదు. మద్రాసు ప్రభుత్వం నిర్మించే విభజనసంఘము విభాగానికి సంబంధించిన వివరాలన్నీ తయారుచేయాలి. ఈ సంఘంలో ఆంధ్రులు తమిళులు సభ్యులుగా ఉంటారు."

ఆంధ్రనాయకులు ఆంధ్రరాజధాని విషయంలో శీఘ్రంగా ఒక నిర్ణయానికి రావాలనీ, తాత్కాలికంగానైనా మదరాసు ఆంధ్రులకు, తమిళులకు సంయుక్త రాజధానిగా ఉండడానికి వీలులేదనీ, ఇలా ఉండడానికి పరిపాలనలోను, ఇంకా మిగిలిన విషయాలలోను, అనేకమైన ఇబ్బందులున్నాయనీ, ఇది ఎంతమాత్రము సాధ్యపడదనీ కామరాజనాడారు అన్నారు.

ఆంధ్రరాష్ట్ర విషయంలోను, మదరాసు విషయంలోను ఒక నిర్ణయానికి రావడంవల్ల, ఇక వాదోపవాదాలకు గాని, పరస్పర నిందలకుగాని అవకాశమేమీ లేదనీ, ఆంధ్ర తమిళనాయకుల పరస్పర సుహృద్భావంతో ఈ సమస్య సాధించడం అవసరమనీ కూడా కామరాజనాడారు చెప్పారు.

### "అఖిలభారత్" హిందూమహాసభ

#### పేరు మార్పుకు కార్యవర్గ నిర్ణయం

న్యూఢిల్లీ, నవంబర్ 27: 'ఆలిండియా' అనే పదాన్ని తొలగించి, 'అఖిలభారత' అని మార్పు చేయడానికి హిందూసభ కార్యవర్గ సమావేశంలో ఈవేళ తీర్మానించారు.

తూర్పు బెంగాల్ హిందువులకు రక్షణ నివ్వటంలో ప్రభుత్వం చూపుతున్న అశ్రద్ధను ఖండించుతూ మరొక తీర్మానం చేశారు. తూర్పు బెంగాలు హిందూకాందిశీకులకు వసతులు కల్పించటానికి పశ్చిమ బెంగాల్, అస్సాం సరిహద్దు ప్రాంతాలలో నివసించుతున్న ముస్లిముల యిళ్లను స్వాధీనం చేసుకోవాలని యీ తీర్మానంలో సూచించారు.

ఇటీవల ప్రభుత్వం ప్రకటించిన కాందిశీకుల ఆస్తి వ్యవహారాల శాసనం పాకిస్తాన్ నుంచి వచ్చిన కాందిశీకులకు యేవిధంగానూ సహాయపడలేని అసమర్థ శాసనంగా వున్నదని ఖండించుతూ మరొక తీర్మానం చేశారు.

అట్టే, నాథూరాంగాడ్సేల రివాలను బంధువులకు యివ్వ నిరాకరించినందులకు మరో తీర్మానం చేశారు.

మహాసభ కార్యక్రమాన్ని సంస్థానాలలోకూడా ప్రారంభించడానికి, రాష్ట్ర సంఘాలను 21 నుండి 27 కు పెంచటానికీ నిర్ణయించారు.

### బటేవియాలో భారతీయ వాణిజ్య మండలి

బటేవియా, నవంబర్ 28: బటేవియాలోని, భారతీయ వర్తకులు, భారతీయ వాణిజ్యమండలిని స్థాపించాలని నిర్ణయించారు.

'ఇండొనేషియా స్వతంత్రం అవుతున్న కారణంగా, ఇండొనేషియా భారతదేశాల మధ్యను వ్యాపారసంబంధాలు పెంపొందటానికి చాలా అవకాశమున్నది. ఈ వాణిజ్యమండలి వచ్చే మాసారంభంలో న్యూఢిల్లీలో జరుగనున్న ఇండొనేషియా ఆర్థిక సమావేశానికి ప్రతినిధులను పంపుతుంది' అని మండలి ప్రతినిధులలో ఒకరన్నారు.

### పుష్పాంజలి

న్యూఢిల్లీ, నవంబరు 27: రాజఘాట్‌లో మహాత్ముని సమాధిపై నుంచుటకుగాను ఫిలిప్పయిన్ రిపబ్లిక్ అధ్యక్షుడు ప్రెసిడెంటు క్విరినో పుష్పగుచ్ఛము నంపియున్నాడు. ఫిలిప్పయిన్సు నుండి శాంతికాముల సభకు ప్రతినిధిగా వచ్చిన లారెంజో బాటిస్టాగారు ఈ గుచ్ఛమును తనతో తీసికొని వచ్చియున్నాడు.

## కమ్యూనిస్టుచైనా పరిగణన సమస్య

### త్వరలోనే భారత ప్రభుత్వ నిర్ణయం

న్యూఢిల్లీ, నవంబరు 28: భారతయూనియన్ పార్లమెంటు యీవేళ ఉదయం 10-30 గం॥లకు సమావేశమైనది. ప్రశ్నల కాలంలో సభ్యులు, భారతవిదేశాంగశాఖ కార్యకలాపాలను గురించి పరంపరగా ప్రశ్నలు వేశారు.

విదేశాంగ వ్యవహారాలశాఖా సహాయమంత్రి డా॥ బి. వి. కేస్కార్ హెచ్. కామత్ ప్రశ్నకు సమాధానమిస్తూ, చైనా కమ్యూనిస్టు ప్రభుత్వం, పరరాజ్యాల సర్వస్వతంత్రాధికారమును ప్రాదేశిక హక్కులను గుర్తించే ప్రపంచ రాజ్యాలన్నింటితోనూ, రాయబార సంబంధాల నేర్పాటు చేసుకోవడానికి అభిలషిస్తున్నామని, నాన్‌కింగ్‌లోని భారత రాయబారి ద్వారా భారత ప్రభుత్వానికి వర్తమానం పంపిందని తెలియజేశాడు. చైనాలో కొత్తగా యేర్పడిన స్థితిగతులను పరిశీలిస్తున్నామని, యీ పరిశీలన పర్యవసానంగా ఏదో ఒక నిర్ణయానికి వచ్చే యీ లోగా, చైనా కమ్యూనిస్టు ప్రభుత్వం అక్కడి భారత ప్రతినిధి ద్వారా సంబంధం కలిగి ఉంటామని భారత ప్రభుత్వం చైనా కమ్యూనిస్టు ప్రభుత్వానికి తెలియపరిచింది అని సిధ్వా అన్నాడు. చైనా కమ్యూనిస్టు ప్రభుత్వాన్ని గుర్తించేవిషయమై అంతిమ నిర్ణయం ఎపుడు జరుగుతుంది అని అడుగగా 'త్వరలోనే' అని కేస్కార్ తెలియజేశాడు.

చైనా కమ్యూనిస్టు ప్రభుత్వాన్ని గుర్తించే విషయమై బ్రిటన్ అమెరికాలతో భారత ప్రభుత్వం సంప్రదిస్తున్నదా? అని త్యాగి ప్రశ్నించాడు.

పండిట్ నెహ్రూ జోక్యం కల్పించుకొని, మిగతా ప్రభుత్వాలమాదిరే భారత ప్రభుత్వంకూడా ప్రపంచ స్థితిగతులను గురించి పరస్పరం సంప్రదించినది. ఈవిషయంలోకూడా, తరచు పరస్పరం సంప్రదించుకొనుట జరిగినదని అన్నారు.

కమ్యూనిస్టుచైనాను గుర్తించే విషయం సి. లో న్ లో జరిగే కామన్వెల్తు విదేశాంగమంత్రుల సమావేశపుఎజెండాలో చర్చనీయాంశంగా ఉన్నదా? అని మన్మోహన్‌దాస్ ప్రశ్నించాడు.

'లేదు' అని నెహ్రూ సమాధానమిచ్చారు.

## గంటల పంచాంగం

విరోధి సం॥ మార్గశిర శు॥ నవమి

1949 సం॥ నవం॥ 29 మంగళవారం

మం॥ నవమి ఉ6-41 పూ॥భా॥ ప10-42 వర్జ్యం రా 9-31 ల 11-20 వ.

శు॥ దశమి నవం॥ 30 బుధవారం

బు॥ దశమి ప 9-18 ఉ॥భా॥ ప 1-46 వర్జ్యం రా 3-21 ల 5-9 వ.


# ఆంధ్ర పత్రిక

విరోధి సం॥ మార్గశిర శు॥ నవమి

మంగళవారం


## ఆంధ్రరాష్ట్రం: తమిళ నాయకుల వైఖరి

నవంబరు 11 వ తేదీ వరకు చెన్నపట్నముపై ఆంధ్రులు తమ హక్కులను పునరుద్ఘాటన చేయుట ప్రత్యేకాంధ్రరాష్ట్రమునకు ప్రతిబంధకమైనట్లు కన్పించెను. కాంగ్రెస్ కార్యవర్గ సూచనను పురస్కరించుకొని ఆంధ్ర రాష్ట్ర కాంగ్రెస్ సంఘము నాయకత్రయ నివేదికను అసందిగ్ధముగ నామోదించి, ...

...పూర్తిగ భిన్నముగ నున్నది. కేంద్రప్రభుత్వ వైఖరి వీరి కపట ప్రవర్తనకు ప్రోత్సాహ మిచ్చుచున్నది. కనుకనే తమిళ కాంగ్రెసు అధ్యక్షుడు కామరాజనాడార్ గారు ...

...యున్న పరిహారము మొత్తములో హెచ్చు భాగము ఆంధ్ర ప్రాంతమునకు చెందవలసియుండును. ఈ ఖర్చు లన్నింటితోబాటు ఆంధ్ర ప్రభుత్వము రాజధానీ నిర్మాణ ...

...చిరకాలముగ వాంఛించుచున్న ప్రత్యేక రాష్ట్ర నిర్మాణము మరి కొంతకాలము వాయిదా పడవచ్చును. అందువలన ఆంధ్రులకు మరికొంత నష్టము కలుగవచ్చును. ...

## నైఋతి ఆఫ్రికాలో నీగ్రో రైతుల దుస్థితి

(1వ పేజీ తరువాయి)

...

# "విస్తృతమైన దేశక్షేమాన్నే అందరూ యోచించాలి"

## ఢిల్లీ పౌర సన్మాన సభలో భారత ప్రధాని నెహ్రూ ప్రసంగం

న్యూఢిల్లీ, నవంబరు 27: పండిట్ జవహర్లాలు నెహ్రూ తన అమెరికా పర్యటన జయప్రదంగా ముగించుకొని వచ్చినందుకు ఆయనను అభినందిస్తూ ఢిల్లీపౌరులు ఏర్పాటుచేసిన సన్మానసభలో మాట్లాడుతూ భారత ప్రధాని, ప్రజలు స్వాతంత్ర్యంవల్ల ఏర్పడిన బాధ్యతలను గ్రహించి దేశాభ్యున్నతికొరకు చాలా కష్టపడాలనీ, ప్రస్తుత ప్రభుత్వాన్ని నిందించడమూ, వెనుకచేసిన ఘనకార్యాలకు దేశీయ నాయకులను కీర్తించడమూ మానాలనీ, భారత దేశంలో నడుస్తున్న విప్లవ యుగంలో ప్రతిప్రతి పురుషుడు అప్రాయకరమైన క్షుద్రవిషయాలను విసర్జించి విస్తృతమైన దేశక్షేమం గురించి ఆలోచించాలనీ హెచ్చరించారు.

...

### ప్రధాని ప్రసంగం

...

### డా. రాజేంద్ర ప్రసాదు ప్రసంగం

...

## ఢిల్లీలో 'ద్వారం' వారి కచేరీ

(1-వ పేజీ తరువాయి)

నాటి 25 తే నాటికి మొత్తం రూ 9075-12-3 తుఫాను నిధికి వసూలుచేసి ఆంధ్ర బ్యాంకులో పంపిరి. సభా విద్యార్థినులు హుండీలతో తిరిగి 1595-3-3 వసూలు చేసిరి. ఇంజనీరింగు కాలేజి సోషలు సర్వీసు లీగువారు రూ 321, భారతీయ మహిళాసభవారు రూ 410 వసూలు పంపిరి. ఈ 50 మించి చందాలిచ్చిన వారిపేర్లు యీ దిగువనగలవు:-

అశోక చారిటబులు ట్రస్టు 501, ఎం. పరమేశ్వరయ్యరు 501. గా॥ గోపాలరెడ్డి గారు 500, మురుగప్ప కంపెనీ 500, జమ్మి వెంకటరమణయ్య కంపెనీ 251, న్యా॥ సోమసుందరం 250, కర్నలు భాటియా సింగు పతి ఆరి, అంజలీదేవి, పి. సూర్యనారాయణ, శ్రీ రాజయ్యరు, రావు అండు రెడ్డి, పాలు అండుకో, చెరి 200, న్యా॥ రాఘవరావు 150 గా॥ సంజీవరెడ్డి, డా॥ కె. ఎన్. కేసరి, గి. బలరామయ్య గార్లు చెరి 116, మైసూరు మెటలువర్క్సు, వి. వరప్రసాదు, ఎ. నాగేశ్వరరావు, కె. ...

## 3 లక్షల టన్నుల ధాన్యం నష్టం

...

## కేంద్ర ప్రభుత్వ లేఖపై రాష్ట్ర మంత్రివర్గ చర్చ

...

# దేశరక్షణలో ఈశాన్య రాష్ట్ర ప్రాధాన్యం

## కేంద్రప్రభుత్వాన్ని బలపరచాలని అస్సాం ప్రజలకు గవర్నరు జనరలు ఉద్బోధ

షిల్లాంగ్, నవంబరు 27: ఇండియా గవర్నరు జనరలు సి. రాజగోపాలాచారిగారు ఈ వేళ ఇక్కడ షిల్లాంగు పురపాలకసంఘం సమర్పించిన స్వాగత పత్రానికి సమాధానం చెబుతూ, అస్సామ్ ప్రజలందరు ఏకీభవించి, కేంద్ర ప్రభుత్వానికి అన్ని విధాలా తోడ్పడాలని అన్నారు.

గవర్నరు జనరల్ రాజగోపాలాచారి అస్సామ్‌కు మూడురోజుల సంచారకార్యక్రమంమీద వచ్చారు. గవర్నర్ జనరల్ ఇంకా ఈ విధంగా అన్నారు. "భారత రక్షణలో మీ రాష్ట్రానికిగల ప్రాముఖ్యం మీరు బాగా గుర్తించారు. పూర్వము భారత రక్షణ విషయంలో పశ్చిమతీరం చాలా ప్రమాదకరంగా ఉండేది. ఇప్పుడు పశ్చిమతీరంకంటె ఇండియా తూర్పు సరిహద్దు ప్రాంతమే ఎక్కువ ప్రమాదకరంగా పరిణమించింది. ఇప్పుడు చైనాలో ఏమి జరుగుతున్నదో మీకందరికీ తెలిసిన విషయమే. చైనా అంతా ఒక్కక్షణంలో ఒక నూత్న ప్రభుత్వం వశమై పోయినది. బర్మా ప్రభుత్వం ఇప్పుడు చాలా చిక్కులలో మునిగి ఉంది. ఇక మధ్యనున్న నమయము ఎంత బలమైనదో మీకు న్యాయ తెలిసిన విషయమే.

మనం అంతా ఐకమత్యంతో ఉండి దృఢతరంగా నిలబడాలి. లేనిపోని పెద చారులు తొక్కకూడదు. ఈ విధముగా ఐకమత్యంతో ప్రవర్తించకపోతే విదేశాల నించి దిగుమతి అయిన అరాజకము, కల్లోలము మనలను చుట్టుముట్టి వేస్తాయి. మన కందరికీ ఐకమత్యంతో మెలగాలనే ఉంటుంది. అయితే మనం స్వార్థపరత్వానికికూడా లోబడిపోతూ ఉంటాము. ఈ స్వార్థపరత్వానికి లొంగిపోతే మనవినాశనం తథ్యమన్న మాటే"

ఆ పిమ్మట గవర్నరు జనరలు అస్సామ్ ప్రజల నందరిని ఐకమత్యంతో మెలగవలసిందని ఉద్బోధిస్తూ ఈ విధంగా చెప్పారు. ఇండియాలో పల ఉన్నవారు కొంత తగాదాలు పడుతున్నా అంతగా ప్రమాదమేమీ లేదు. కాని సరిహద్దులలో ఉండే వారు తమలో తాము కలహించడం మంచిది కాదు. అందుచేత మీరందరు ఐకమత్యం విషయంలో మరింత జాగ్రత్తగా ఉండాలి. అల్లాగే అన్నివిధాలా మీరు కేంద్రప్రభుత్వాన్నికూడా దృఢతరంగా చెయ్యడానికి సాయపడాలి. కేంద్రం దృఢతరమైతేగాని పరిష్కాములు ఆత్మరక్షణ చేసుకోలేవు. మనదేశంచుట్టూ కల్లోలము, అశాంతి, నానాటికి ఎక్కువైపోతున్నాయి. మనలోమనం దృఢతరమైన ఐకమత్యాన్ని పెంపొందించుకోకపోతే, చుట్టూరా ఉన్న దుష్టశక్తులు ఎప్పుడో మనలను కబళించివేస్తాయి. దేశంలో శాంతి వాతావరణం కలిగించాలన్నా, ప్రజాక్షేమం పెంపొందించాలన్నా మనం అందరము కేంద్రప్రభుత్వాన్ని బాగా బలపరచాలి. నేనీ విషయం మీకు గవర్నరు జనరలుగా చెప్పటంలేదు. సామాన్య భారతపౌరుడుగా నేనీ విషయం ఉద్బోధిస్తున్నాను.

మీరు నాకిచ్చిన స్వాగతపత్రంలో పట్టణం పరిశుభ్రంగా ఉంచుతున్నందుకు హరిజనులకు కృతజ్ఞులమై ఉన్నామని అన్నారు. మీరు ఇలాగ ఎందుకన్నారో నాకు తెలియదు. పట్టణాలు పరిశుభ్రపరచడానికిఎల్లకాలము నంఒకవర్గంమీద ఆధారపడి ఉండడానికి వీలులేదు. మన పరిశుభ్రత విషయంలో మనం జాగ్రత్త పడకపోతే ఎప్పుడో ఒకప్పుడు మనకా విషయంలో చిక్కులు వస్తాయి. ముఖ్యమైన విషయాలలో ఎప్పుడు మనం ఒక వర్గంమీద ఆధారపడి ఉండకూడదు. ఉరితీతఉపన్యాసాలలోను, పుస్తకాలలోను వర్ణవ్యవస్థ నొక్కి వక్కాణించి నయ్యాలని చెబుతూ దైనందినావసరాలకోసం వర్ణవ్యవస్థ నిలబెట్టడం మనం మానివెయ్యాలి. నేనిప్పుడు మీకేమీ విస్తరం బోధించడం లేదు. ఇప్పుడు చాలాసుఖంగా కాలక్షేపం చేసే వారికి ముందుముందు ఇబ్బందులు రాబోతున్నవనే నేను హెచ్చరిస్తున్నాను. అందరు అన్ని పనులు చెయ్యడానికి సిద్ధంగా ఉండాలి. ఇది వివేకంతో కూడిన పని. మనమతాలన్నీ ఈవిషయమే బోధించాయి. వేకపోతే పాకీ పని మొదలైన అసహ్యకరమైన పనులు చేసే వాళ్ళకు ఎక్కువగా జీతాలైనా ఇవ్వవలసివుంటుంది.

ఇక్కడ నినుంచి ఈ అసహ్యకరమైన పనికి నానాటికి ఖరీదు పెరిగిపోతుంది. ఇప్పుడు లక్షలు ఖర్చుపెట్టేదానికి ముందు ముందు కోట్లు ఖర్చుపెట్టవలసి ఉంటుంది. అందుచేత మనం వున్న ప్రదేశాలన్నీ స్వయంగా పరిశుభ్రపరచుకోవాలి"

గవర్నర్ జనరల్‌కు ఇక్కడ వున్న క్లబ్బులో స్వాగతపత్రం సమర్పించారు. అస్సామ్ గవర్నర్ వారికి స్వయంగా స్వాగతం ఇచ్చారు. ఆ పిమ్మట అస్సామ్ గవర్నరు గవర్నరు జనరలుతో పురపాలక సంఘాధ్యక్షునికి పరిచయం కలిగించారు. పురపాలక సంఘాధ్యక్షుడు ఉపేంద్ర చంద్రరాయి తన స్వాగతోపన్యాసంలో అస్సామ్ పాకిస్థాను సరిహద్దులలో ఉన్నదనీ, అందుచేత విభజనవల్ల అనేకమైన ఇబ్బందులు వచ్చాయనీ, అస్సామ్‌లో పళ్లు ఆహారాలు సమృద్ధిగా దొరికినా, ధాన్యానికి కొంతఇబ్బందిగా ఉన్నదనీ, అయినా ఆ ఇబ్బందులు ఎదుర్కోవడానికి తాము శాయశక్తులా పనిచేస్తున్నామని అన్నారు.

### కొండజాతి ప్రతినిధులతో సంప్రతింపులు

గవర్నరు జనరలు ఈ వేళ వుదయం 38 మంది కొండజాతి నాయకులకు దర్శనం యిచ్చారు. వీరిలో ఆగ్నేయ భాగంలోని కొండజాతుల నాయకులు కూడా వున్నారు. గవర్నర్ జనరల్ ప్రతి ఒక్క నాయకునితోను ప్రత్యేకంగా సంభాషించారు. ఆసంభాషణలో వారు కొండ జాతులకు సంబంధించిన భారత రాజ్యాంగ చట్టాలను గూర్చి ఆయా జాతుల ప్రతినిధుల అభిప్రాయాలు కూడా తెలుసుకున్నారు. తనసంభాషణలో కొండజాతుల ప్రతినిధుల నందరినీ ఉద్దేశించి ఐకమత్యంతో మెలగవలసిందనీ, భారత ప్రభుత్వానికి అన్ని విధాలా సాయపడవలసిందనీ హెచ్చరించారు. ఆయన వారితో ఇంకా ఈవిధంగా అన్నారు. "మీరందరు చాలా మారాన్నుంచి ఇక్కడికి రావడం నాకు చాలా సంతోషంగావున్నది. మీ సమస్యలన్నీ కూడా నేను సాకల్యంగా అవగాహన చేసుకున్నాను. కల్లోలాలేమీ లేకుండా మీ పరిస్థితులు బాగుపడాలని మీకు కోరుతున్నారు.

భారత ప్రభుత్వాభిప్రాయం కూడా ఇదే.

అయినా మీకొకవిషయం చెప్పవలసివున్నాను. ఇంతవరకు ప్రపంచం ప్రశాంతంగానేఉన్నది. అయితే ఇప్పుడు చైనా, బర్మా, టిబెట్టులలో పరిస్థితులు చాలా కల్లోలంగా ఉన్నాయి. మీ సరిహద్దులలోనే ఆ కల్లోలం వ్యాపిస్తున్నది. మీలో నూతనబుద్ధి లీ విషయాలన్నీ గ్రహించే వుంటాము. మీరందరు ఏకమై భారతప్రభుత్వానికి తోడ్పడితేతప్ప వచ్చేకల్లోలం ఎదుర్కోనడం చాలా కష్టము. మీరు భారత ప్రభుత్వంతో సహకరించకపోతే మీ ఆచార వ్యవహారాలన్నీ ఒకనిమిషంలో గాలికి ఎగిరిపోతాయి.

భారత ప్రభుత్వానికి మీవిషయాలన్నీ తెలుసును. నేనుకూడా మీకు చేయగలిగిన సాయంతంతా చేస్తానుస్తే. మీ ఆచార వ్యవహారాలు, మీ హక్కులు మేము సాధ్యమైనంతవరకు సంరక్షిస్తాము. ఈలోగా మీరు అస్సాం గవర్నరుతో మీ వ్యవహారాల విషయమై సంప్రతించాలి.

మీకు బర్మాగాని టిబెట్టుగాని తోడ్పడేస్థితిలో లేవు. భారతప్రభుత్వం మీ కుటుంబాలను మిమ్ములను సంరక్షించే శక్తి గలిగిఉన్నది. అందుచేత భారతప్రభుత్వంలో చేతులు కలిపే విషయంలో వెంటనే ఒక నిర్ణయానికి రావాలి. ఇదే నేను మీకిచ్చే సలహా."

ఆపైన గవర్నరుజనరలు సైన్య కేంద్రము, మొదలైన సంస్థలు సందర్శించారు.

---

## మద్రాస్ గుఱ్ఱపు పందెములు

### లీక్‌నోట్‌కు రేస్‌క్లబ్ కప్

చెన్నపట్నం, నవంబరు 28: మదరాసు గుఱ్ఱపు పందెములలో నిన్నటిరోజున గిండి యందు 7 పందెములు జరిగినవి. రేస్‌క్లబ్ కప్పను లీక్‌నోట్ అనే గుఱ్ఱము 17 గుఱ్ఱములతో కలిసి పరుగెత్తి గెలిచెను. గెలుపుకు రూ 40 ప్లేసులకు రూ 18, 13, 20 చొప్పున లభించెను. జాకీలలో మాడు రేసులను యస్‌హిల్ 4 పందెములను గెలిచిరి. ట్రెబిల్‌టోట్ 48 టికెట్లుకు రూ 400 ఎవిలిటోట్ రూ 174 లభించెను.

---

# సమితి ప్రణాళిక నిబంధనలకు రష్యా ఉల్లంఘన

## దర్యాప్తు చేయవలసిందిగా చైనాప్రతినిధి వర్గ విజ్ఞప్తి

లేక్‌సక్సెస్, నవంబర్ 26: ఐక్యరాజ్య సమితి ప్రణాళిక నిబంధనలను, 1945 లో చైనాతో చేసుకున్న సంధి ఒడంబడిక షరతులను, చైనా కమ్యూనిస్టులకు సహాయం చేయడం ద్వారా, ఉల్లంఘించిందా లేదా అనే విషయాన్ని విచారించి కనుక్కోవలసిందిగా చైనా ప్రతినిధి వర్గం యివ్వాళ ఐక్యరాజ్య సమితిని కోరింది.

చైనా కమ్యూనిస్టు ప్రభుత్వాన్ని గుర్తించవద్దని, సభ్యత్వ రాజ్యాలన్నింటిని కోరవలసిందిగా కూడా సమితిని చైనా ప్రతినిధి వర్గం అడిగింది.

వచ్చేవారం సమితి రాజకీయ సంఘ చర్చకు చైనా ప్రతినిధి వర్గం ప్రతిపాదించిన తీర్మానములో యీ కోరికలు పొందుపరుపబడినవి.

సభ్యత్వ రాజ్యాలన్ని చైనా కమ్యూనిస్టులకు, ఆర్థికంగా గాని సైనికంగా గాని సహాయం చేయడం మానాలని, ప్రస్తుత పరిస్థితిని అవకాశంగా తీసుకొని చైనా సర్వస్వతంత్రతకుగాని, ప్రాదేశిక సుస్థిరతకుగాని విరుద్ధమైన యే పని చేయగూడదని, సమితి ఆదేశించాలి." అని తీర్మానంలో చైనా ప్రతినిధివర్గం కోరింది.

తీర్మానం ఉపోద్ఘాతం యిలా ఉన్నది. "శాంతిభద్రతల రక్షణే సమితి ప్రధాన కర్తవ్యమని, అందువల్ల వీటికిముప్పు ఘటిల్ల చేసే చర్యల నివారణకు సమిష్టిగా చర్య గైకొనుట సమితి ముఖ్యధర్మం. మిగతా స్వాతంత్ర్య ప్రియ దేశాలతో చెయిగలిపిచీర్ఘ కాలం అక్షరాజ్యాల దురాక్రమణ ప్రతిఘటిస్తు చైనా ప్రజలు చేసిన త్యాగములే, నేటి చైనా క్లిష్టపరిస్థితికి కొంత కారణమని, సమితి అభిప్రాయపడుతున్నది. జపాను పతనమైన దాదిగా ఈశాన్యరాష్ట్రాలలో (మంచూరియా) తన అధికారాన్ని పునరుద్ధరించుకొనుటకు జాతీయ చైనాచేసే ప్రయత్నాలకు సోవియటురష్యా అడుగడుగునా ప్రతిబంధకాల సృష్టిస్తు, జాతీయచైనా ప్రభుత్వంపై తిరుగుబాటు సాగిస్తున్న కమ్యూనిస్టులకు, ఆర్థికంగా సైనికంగా సహాయపడినదని సమితి తెలుసుకొన్నది." తరువాత సమితి చేయాల్సిన నాల్గుపనులు నిర్దేశింపబడినవి.

పిమ్మట "చైనా కమ్యూనిస్టులకు ఆర్థిక సైనిక సహాయంచేస్తు సమితి ప్రణాళికను 1945 లో చైనాతో చేసుకొన్న మైత్రి ఒడంబడికను ఉల్లంఘించినది" అని తీర్మాన పాఠం మొదట్లో ఉల్లేఖింపబడింది.

---

## కమ్యూనిస్టుల "శాంతి" సమావేశ నిర్ణయం

కలకత్తా, నవంబర్ 27: కమ్యూనిస్టుల ఆధ్వర్యాన, యిక్కడికి నాలుగురోజుల నుంచి యిక్కడ జరుగుతున్న అఖిల భారత శాంతి సమావేశాలు ఈ వేళ ముగించాయి. ఈ సమావేశాల ముగింపులో కడచినరాత్రి ఒకపెద్ద ప్రజా ప్రదర్శనాన్ని తయారుచేశారు. సాయంత్రం యేర్పాటు చేయబడిన 'వైజ్ఞానిక ప్రదర్శనాలను' పోలీసు కమీషనర్ బహిష్కరించారు. ప్రదర్శనలు చూపటానికి మైదానం మీదికి వచ్చిన 20 వేలమంది ప్రజలూ నిరుత్సాహపడి చౌరంగీ, అస్తోష్ ముఖర్జీ రోడ్ల ఒక పెద్ద అసమ్మతి ప్రదర్శనోత్సవాన్ని బయలు దేరదీశారు.

శాంతి సంఘం శాశ్వత కార్యాలయాన్ని బొంబాయిలో యేర్పాటు చేయటానికి నిర్ణయం జరిగింది. డబ్లియూ. సి. చెట్టియారుగారిని అధ్యక్షులుగా నూ, గోవాన్‌కర్‌గారిని కార్యదర్శిగానూ ఎన్నుకున్నారు.

---

## జనవరి 2 న టెక్స్‌టయిల్ కార్మికుల అసమ్మతి

బొంబాయి, నవంబరు 27: నిన్నటి దినం డెలిగేట్ల సమావేశంవారు, "జనవరి 2 వ తేదీని అఖిలభారత టెక్స్‌టయిల్ కార్మికుల అసమ్మతి సమ్మెదినంగా పరిగణించాలి." అని చేసిననిర్ణయాన్ని, అఖిల భారత టెక్స్‌టయిల్ కార్మికుల సర్వసభ్య సమావేశం ఈ నాటి సమావేశంలో అంగీకరించింది. ద్వితీయవార్షికోత్సవాన్ని నెరపుతున్న ఈఆకార్మికసంఘం, కమ్యూనిస్టుల ఆధ్వర్యాన నడుస్తున్న సంస్థ.

"జీతాలతగ్గింపును, కార్మికులను బెస్ట్ పెట్టిన తగ్గించివేయుటను నిరుద్యోగానికి వ్యతిరేకంగా సాగించబడుతున్న ఈ సమ్మెలో టెక్స్‌టయిల్ కార్మికులంతా పాల్గొనాలని హెచ్చరికచేశారు.

డిశంబరు 22 వ తేదీని "నిరుద్యోగ వ్యతిరేకదినం"గా పరిగణించటానికికూడా ఈ సమావేశంవారు నిర్ణయించారు.

---

# జరూసలెం పరిపాలన సమస్య

## విచారించేందుకు 11 రాజ్యాల ప్రతినిధులతో ఒకకమిటీనియమించాలనిఇండియాప్రతిపాదన

### సమితి రాజకీయ సంఘంలో బి. ఎన్. రావు ప్రసంగం

లేక్‌సక్సెస్, నవంబరు 26: జరూసలెం నగరంపై అంతర్జాతీయ పరిపాలన నెలకొల్పే విషయం తేల్చేందుకు, 11 రాజ్యాల ప్రతినిధులతో ఒక ఉపసంఘం యేర్పాటు చేయాలని, భారతప్రతినిధివర్గనాయకుడు సర్. బెనిగల్ నరసింగరావుగారు యీ వేళ ఐక్యరాజ్య సమితి రాజకీయ సంఘానికి సూచించారు.

జరూసలెం నగరం విషయంలో భారత దేశానికి ఒకవిధమైన ఆసక్తి ఉన్నదని; భారత దేశంలో 3 కోట్లన్నర ముస్లింలు, 80 లక్షల మంది క్రైస్తవులు, కొంతమంది యూదులు ఉన్నారని, కాబట్టి జరూసలెం భవిష్యత్తు విషయంలో తీవ్ర ఆందోళన కనబరిచే అన్నిరకాల జనాభా భారత దేశంలో ఉన్నదని నరసింగరావుగారు అన్నారు.

అన్ని పక్షాల అంగీకారంతోగాని, లేదా అన్నిపక్షాలు విధిగా కట్టుబడి ఉండే విధంగాగాని యీ సమస్య పరిష్కృతం కావాలి. ఇంతవరకుంచి మంచి మార్గమేమీ నాకు కన్పించడంలేదు. ఏదైనా ఒక పరిష్కారం కనిపెట్టి, దానిని బలవంతంగా రుద్దేకంటే, అన్నిపక్షాల అంగీకారంతో సమస్యను పరిష్కరించడం ఉత్తమం. కాబట్టి ముందుగా అన్నిపక్షాల అంగీకారంతో సమస్యను పరిష్కరించ బూనుటే మా ఉద్దేశ్యం. అందుకే మనమంతా మొదట ప్రయత్నించాలి. ఈ సమస్యా పరిష్కారానికి మన కిప్పటికే ఎన్నో ప్రతిపాదనలు అందినవి. అందులో, 1947 నవంబర్ 29 న ఐక్యరాజ్యసమితి సూచించిన అంతర్జాతీయ పరిపాలన; సమితి మధ్యవర్తిసంఘం ప్రతిపాదించిన ప్లాను, ఆస్ట్రేలియాక్ ముసాయిదా తీర్మానము, సాల్వడార్ సోవియట్ రష్యలు సూచించిన సవరణలు, సిరియాసూచనలు, ఇజ్రాయిల్ ప్రతిపాదన. యీ మొదలగు వాటన్నింటిని, పరిశీలించుటకు ఒకకమిటీని యేర్పాటుచేసి, సర్వపక్షాంగీకార పరిష్కారాన్ని ఆశ్వేషించడం మంచిది.

ఇటలీవలసే రాజ్యాల భవిష్యత్తు నిర్ణయించడంలోసమితి రాజకీయసంఘం యీ పంథానే తొక్కింది. సత్ఫలితాలు చేకూరినవి. జరూసలెం నగరం విషయంలో కూడా యీ పద్ధతి అవలంబించతగునని సలహా యిచ్చుటకు సాహసిస్తున్నాను. కనుక 11 రాజ్యాల ప్రతినిధులతో ఒక కమిటీని నియమించాలి. జరూసలెం నగరాన్ని అంతర్జాతీయ పాలనక్రింద తెచ్చే ఉద్దేశ్యంతో ప్రతిపాదింపబడిన, లేదా ప్రతిపాదింపబడే ప్లానులను, యీ కమిటీ పరిశీలించి, 1949 డిసెంబర్ 1 లోగా తన నివేదికను రాజకీయసంఘానికి సమర్పించాలి. జరూసలెం సమస్యను, యీ కమిటీ విడిగా పరిశీలిస్తుంటే, ఎజెండాలోని మిగతా అంశాలను చర్చించుటకు రాజకీయ సంఘానికి, వ్యవధి ఉంటుంది.

పాకిస్థాన్ ప్రతినిధి సర్ మహమ్మద్ జఫ్రుల్లాఖాన్ మాట్లాడుతూ, 1947 నవంబర్ 29 తీర్మానం ప్రకారం, జరూసలెంను అంతర్జాతీయ నగరంగా చేయుటకు ఐక్యరాజ్యసమితి నిశ్చయించింది గనుక యీ లక్ష్యసిద్ధికి దోహదమిచ్చే యే తీర్మానానైనా పాకిస్థాన్ బలపర్చగలదని అన్నాడు.

అసలు యీ సమస్యను పరిష్కరించగలమనే, నమ్మకంతో పనికి ఉపక్రమించగలగడం కష్టమని, యిందుకు కారణం, పాలస్తీనా సమస్య, 2 వేల యేండ్ల ప్రాచీన భూభాగానికి ఘోర దురవస్థ తెచ్చి తెచ్చిపెట్టినదని, యీ సమస్యకు పరిష్కారమంటూ, అనేక వేలమందిని స్వస్థానాలనుండి వెడలగొట్టడం జరగనము, ఇజ్రయిల్ రాజ్యం స్థాపింపబడటం జరిగిందని జఫ్రుల్లా అన్నారు.

ఉభయ పక్షాల మధ్య సమాధానం కుదరక ముందే జరూసలెం నగరాన్ని సైన్య విముక్తంచేసే వంచనకు ట్రాన్స్ జోర్డన్ గురి కాకూడదని, పరిష్కారం కుదిరే లోగా, తన ఆధీనంలో ఉన్న నగర ప్రాంతంలో, అరబ్ ముస్లింల, క్రైస్తవుల రక్షణకు జోర్డాన్ బాధ్యత వహించాలని, జఫ్రుల్లా హెచ్చరించాడు.

జరూసలెం నగరం విషయంలో అసక్తులుగా ఉన్న వారు సమాధానానికి రాగలిగేటంతవరకూ జరూసలెం సమస్యను వాయిదా వేయడం మంచిదని యుగోస్లావియా ప్రతినిధి సూచించారు.

ట్రాన్సుజోర్డాన్ ప్రతినిధి ఫౌజీముల్కి జరూసలెం నగరం పై ప్రస్తుతము తన కున్న అధికార ఆధిపత్యములను, ట్రాన్స్ జోర్డాన్ వదలుకో జాలదని ప్రకటించాడు.

"జరూసలెం రక్షణ తన విధ్యుక్తమని దానిని వదలుకోవడం అసంభవమని"నా ప్రభుత్వం తలంచుచున్నది. పాలస్తీనా ప్రస్తుత స్థితిగతులను మార్చ బూనుకోవడం, మాత్రమేకాకున్నకు విరుద్ధమే గాక, తీవ్ర పరిణామాలకు గూడా దారి తీయునని నా ప్రభుత్వం విశ్వసిస్తున్నది" అని హెచ్చరించాడు.

ఫ్రెంచి ప్రతినిధి మూడు ప్రశ్నలడిగాడు. జరూసలెం అంతర్జాతీయ పాలిత ప్రాంతంగా అంగీకరించాలని ఆయా పార్టీలను ఒప్పించే, రాజకీయ బాధ్యతను, ఐక్యరాజ్యసమితి తనపైత్తిన వేసుకోవడానికి సంసిద్ధంగా ఉన్నదా (2) జరూసలెం పరిపాలనాధికారబాధ్యతి స్వీకరించడానికి సిద్ధంగా ఉన్నదా (3) నగర పరిపాలనకు సంబంధించిన ఆర్థిక బాధ్యతల వహిస్తుందా? లెబనాన్ ప్రతినిధి చార్లెస్‌మాలిక్ మాట్లాడుతు నగరాన్ని అంతర్జాతీయ పరిపాలితప్రాంతం చేయాలని అభిప్రాయపడే వారంతా, కష్టించి పనిచేసి, యీ సమావేశంలోనే అది ఫలించేటట్లు చూడకపోతే, తరువాత, పరిస్థితి మీకు అదుపులో లేనట్లు తెలుసుకోగలుగుతారు. అందుకు మిమ్మల్ని మీరే నిందించుకోవాల్సిఉంటుంది"అని హెచ్చరించాడు. అనంతరం చర్చ సోమవారం నాటికి వాయిదా పడింది.

---

# నైగీరియాలో తీవ్ర అశాంతి

## ప్రజలపై పోలీసు కాల్పులు: పలువురికి గాయాలు

లాగోస్, నవంబరు 27: నైగీరియా తూర్పు రాష్ట్రాల్లో, ఒనిట్షాలో నిన్నటి దినం పోలీసులు ప్రజా సమూహాన్ని, బాష్పవాయువు లాటీ ప్రయోగాలతో చెదరగొట్టలేక, కాల్పులు జరిపారు. ఈ కాల్పులవల్ల ముగ్గురు ఆఫ్రికనులు గాయపడ్డారు. ఈ కాల్పులనుగురించి ప్రభుత్వం యీ ప్రకటనచేసింది.

నిన్న ఉదయం ప్రజలు పెద్దపెద్ద గుంపులుగా, ఒనిట్షాలో దుకాణాలను దోచుటకు బయలుదేరారు. పోలీసులు వీరిని చెదరగొట్టుటకు బాష్పవాయువు ఉపయోగించారు. లాటీచార్జి జరిపారు. కానీలాభంలేకపోవుటచే విధిగా కాల్పులుజరపవలసివచ్చింది. ఈ కాల్పుల మూలంగా ముగ్గురు గాయపడ్డారు, వీరిలో ఒకడు తీవ్రంగా గాయపడ్డాడు.

శనివారం సాయంత్రం కలాబార్‌లో గూడా దుకాణాలను దోచుటకు ప్రజాసమూహాలు ప్రయత్నించాయి. కానీ వాటిని పోలీసులు చెదరగొట్టి కర్ఫ్యూ అమలుజరిపారు. గవర్నర్ మెక్‌ఫర్సన్, బ్రిటిష్ వలసరాజ్య శాఖా కార్యదర్శితో సంప్రదించి, "నైగీరియాలో యిటీవల అల్లరులకు, ముఖ్యంగా ఎనుగూలో కార్మిక అశాంతికి కారణమేమిటో విచారించుటకు ఒక కమిటీని యివ్వాళనియోగించాడు.

---

# ఇండియాకు అమెరికా సహాయం

## కమ్యూనిజం అరికట్టుటకు అవసరమని లండన్ పత్రిక

లండన్, నవంబరు 26: లండను లో ప్రకటింపబడుచున్న "వీక్లి-ఎకానమిస్టు" అను పత్రిక యిట్లు వ్రాయుచున్నది. పండిట్ జవహర్లాలు నెహ్రూగారు యిటీవల అమెరికాకు వెళ్లియుండినప్పుడు గల సందర్భ పరిస్థితులు చాలా ముఖ్యమైనవి.

అమెరికావంటి విదేశముల సహాయము భారతదేశమునకు కావలెననే విషయమును అమెరికనుల మనస్సుకు నాటునట్లు జవహర్లాలు నెహ్రూగారు నొక్కి వక్కాణించిరి.

అమెరికా ఇదివరలో మార్షలు పథకము ననుసరించి యూరోపు ఖండములోని పశ్చిమ రాజ్యాలకు సహాయము చేయుచునే యున్నది. అట్టి సహాయమును కొన్ని షరతులకు లోబడి చేయుచున్నది కాని, సహాయంపొందే రాజ్యాలు ఆ షరతులకు లోబడి యుండుటవల్ల ఆ దేశ ప్రభుత్వముయొక్క అధికారస్వాతంత్ర్యమునకు భంగము కలుగకూడదు. ఈవిషయమును మార్షలు పథక వ్యవహారానుభవము వల్ల అమెరికా గ్రహించియున్నది.

ఆసియా ఖండమునకు తగినంత అభివృద్ధి కలుగవలెనంటే, అందుకు కావలసిన పెట్టుబడియంతయును అమెరికానుండియే రావలెను కమ్యూనిజం క్రమేణ ఆసియాలో వ్యాపించి అచటి పరిస్థితులను స్తంభింపజేయుచున్నది. ఇటువంటికమ్యూనిజం వ్యాప్తిని అరికట్టుటకు భారతదేశమునకు అమెరికా సహాయ మత్యవసరము. ఆసియా ఖండములోని అనేక దేశములకు ఒక్క పర్యాయముగా సహాయము చేయవలెనని అమెరికా ప్రభుత్వ సంకల్పము. కాని ఆసియా ఖండమున కంతకును మకుటాయమానమైనది భారతదేశము. కనుక భారత దేశములోని ప్రజల జీవిత సౌకర్యములు ఉపాధులు హెచ్చవలెను. భారతదేశమునకు యంత్ర సామగ్రులను సప్లయిచేయుట మూలంగానే భారతదేశ ప్రజలకు జీవన ప్రమాణము హెచ్చవలెను. అట్టి యంత్ర సామగ్రులు తమకు సప్లయి చేయవలెనని భారతదేశం ఒత్తిడి చేయుచున్నది. అదిన ముగా అమెరికా యంత్ర సామగ్రులను ఇండియాకు సప్లయి చేయుటవల్లనే భారతదేశంలో కమ్యూనిష్టు తత్వంలేని ప్రభుత్వము స్థిరంగా వర్ధిల్లగలదు. భారతదేశము ఆర్థికంగా వృద్ధిలోనికి వచ్చిననే తప్ప ఆగ్నేయాసియా ప్రాంతములో భారతదేశము ప్రాముఖ్యము వహించి అగ్రస్థానము పొందజాలదు.

### ఉచిత వైద్య శాఖ

తిరువల్లిక్కేణికృష్ణంపేటలోధన్వంతరి మిషను ఉచిత వైద్యశాలను డా॥ వి. కె. జానుగారు 27 ఉదయం తెరచిరి. ఎన్. రఘునాధయ్యరు సభకు అధ్యక్షత వహించిరి.

---

# నవభారతాభ్యుదయానికి సజీవమైన విద్యావిధానం

## బొంబైప్రధాని ఖేర్ ఉద్బోధ

అలహాబాదు, నవంబరు 27: "జాతీయ ప్రభుత్వము నెదుర్కొనుచున్న ముఖ్య సమస్య లన్నిటిలోను జాతీయ విద్యావిధాన మేర్పరచు సమస్య విలక్షణమైనది. స్వతంత్రభారతము నిజముగా జాతీయమైన విద్యావిధానమును ప్రవేశపెట్టుట అత్యవసరము. జాతీయ విద్యావిధానము సజీవమైనది. స్వతంత్ర భారతదేశ అవసరములకు తగిన విద్యావిధాన మున్నగాని మనదేశమును సుఖవంతమును, సంపన్నమును అగు దేశముగా చేయవలెనని మనము కనుచున్న కలలు, సఫలములు కావు." అని బొంబాయి రాష్ట్రప్రధాని శ్రీ బి. జి. ఖేర్‌గారు సం॥ రా॥ ప్రభుత్వ నిర్మాణ శిక్షణ కళాశాలను ప్రారంభించుచు చెప్పిరి. ఈ ఉత్సవమునకు సం॥ రా॥ గవర్నరు సర్. ఎచ్. పి. మోడీగారు అధ్యక్షత వహించిరి.

ఈ పాఠశాలలో ఉపాధ్యాయులుగా నున్నవారికి వ్యవసాయము, కుంభకారవృత్తి పారిశ్రామిక రసాయనశాస్త్రము, వాణిజ్యము, లోహపుపని, అప్లయిడ్ మెకానిక్కు, మున్నగుపనులు నేర్పెదరు.

ప్రాత విద్యావిధానము ప్రభుత్వోద్యోగియులను మాత్రమే తయారు చేయుచుండెనని, ఇతర వృత్తుల నవలంబించు వారిని తయారు చేయకుండెనని శ్రీ బి. జి. ఖేర్ గారు చెప్పిరి. ఆ విద్యావిధానము దేశముయొక్క అవసరములను తీర్చు బాధ్యతను తలదాల్పువారిని తయారు చేయకుండెనని. 1951 సం॥ము తరువాత విదేశములనుండి ఒక్క ధాన్యపుగింజను గూడ దిగుమతి చేసికొనమని భారత ప్రధాని పండిత నెహ్రూగారు ప్రకటించెనని ఖేర్ గారు చెప్పుచు మనకు కావలసిన ఆహారమును మనమే ఉత్పత్తి చేసికొనవలెనని కనుక మన విద్యావిధానము మన అవసరములను తీర్చునదిగా నుండవలెనని, ఎక్కువగా ఆహారపదార్థములను పండించువారిని మనము తయారు చేయవలెనని చెప్పిరి.

సెకండరీ విద్యా విధానమును పునర్నిర్మించి, వివిధ రకములైన విద్యార్థులకు తగినవిద్యను, వివిధ వృత్తులకు తయారు చేయు విద్యను ప్రవేశపెట్టవలెననిరి. బొంబాయి రాష్ట్రములో ఉన్నత పాఠశాలల నన్నిటిని సాంకేతిక పాఠశాలలుగానో వ్యవసాయ పాఠశాలలుగానో, వాణిజ్య పాఠశాలలుగానో మార్చివేసిరని, ఈ పద్ధతినే అవలంబింపవలసినదని ప్రయివేటు పాఠశాలలవారిని కోరిరని శ్రీ ఖేర్‌గారు చెప్పిరి. తగిన ఉపాధ్యాయులు లభించకున్నారని ప్రాతపద్ధతిలో శిక్షణ పొందిన వారు చేతితో పనిచేయు మెరుంగరనిరి. కనుక వృత్తిని మన ఉపాధ్యాయులకు నేర్పవలెననిరి.

సర్. ఎచ్. పి. మోడీగారుగూడ ప్రాత విద్యయందలి లోపములు తెలిపి, దేశమునకు వృత్తుల నవలంబించువారు విశేషముగా కావలసియున్నారనిరి. ఈ రాష్ట్రములో యిందుకు ప్రారంభము జరిగినదని ఇది యింతవరకు జయప్రదమునో చూడవలసి యున్నదని చెప్పిరి.

శ్రీ సంపూర్ణానందగారు శ్రీ బి. జి. ఖేరును ఆహ్వానించుచు రాష్ట్రములో విద్యావిధానము సారస్వతవిద్య, శాస్త్రీయ విద్య, నిర్మాణవిద్య, లలితకళలు అను నాల్గు రకములుగా విభజింపబడినవని, ఉన్నతవిద్యకై కళాశాలలకు వెళ్ళజాలని వారికి వృత్తివిద్య నేర్పబడుచున్నదని ఆయన చెప్పెను.

### మదరాసు సహకార సభ

చన్నరాష్ట్రి సహకారసభ 27 సమావేశము డిశంబరు 31, జనవరి 1 వ తేదీలందు పచ్చయ్యప్ప కాలేజియందు ఆర్. జి. సయ్య ఓ. బి. ఇ. బొంబాయి సహకారబ్యాంకు అధ్యక్షుని అధ్యక్షతను జరుగును. ప్రదర్శనముకూడ జరుగును—అని రాష్ట్రసహకారసంఘ కార్యదర్శి పి.నటేశయ్యగారు ప్రకటించుచున్నారు.

---

# ప్రపంచంతో భారతదేశ సాంస్కృతిక బాంధవ్యాలు

## ఢిల్లీసమావేశంలో మండలినిర్ణయం

న్యూఢిల్లీ, నవంబర్ 27: ఈ వేళ్ళజరిగినభారత సాంస్కృతిక బాంధవ్య మండలి సమావేశంలో, ప్రధాని నెహ్రూసూచనను అనుసరించి 'సాంస్కృతిక బాంధవ్యాలను ఒక్క ఆసియా రాజ్యాలతోనే కాక ప్రపంచంలోని అన్ని దేశాలతోనూ పెంపొందించుకోవాలని తీర్మానించారు.

మండలి దృక్పధాన్ని ఇలా విస్తృతం చేస్తూ ఈ వేళ ఈమండలి తాత్కాలిక కార్యవర్గం, ఈ వేళ మండలి కార్యక్రమ విధానాన్ని తయారుచేశారు. ఈ సమావేశానికి మౌలానా ఆజాద్ అధ్యక్షత వహించారు.

వివిధభాషలకు, కళలకు విస్తృతి వ్యాప్తి కలిగించి పరస్పరం అవగతం చేసుకోగల అవకాశాన్ని కలిగించటం; వివిధ విశ్వవిద్యాలయములమధ్య శాస్త్ర, సాంకేతిక, విద్యాకేంద్రాలమధ్య కళాకేంద్రాల మధ్య సాన్నిధ్యాన్ని పెంపొందించటం సాంస్కృతిక సహకారాన్ని పెంపొందించటానికి అవసరమైన చర్యలన్నీ తీసుకోవటం ఈ కార్యక్రమాన్ని ఈ మండలి నిర్వహించుతుంది.

ప్రత్యేకసంఘం తయారుచేసిన మండలి నిబంధనావళి ముసాయిదాను తాత్కాలిక కార్యవర్గం ఆమోదించింది. మండలిని రెండు భాగములుగా విభజించుకున్నారు. అందులో ఒక భాగం, తూర్పు ఆసియా, టర్కీ, యీజిప్టు ప్రాంతాలకొరకు పని చేస్తుంది. రెండవభాగం ఆగ్నేయాసియా దేశాలకొరకు పనిచేస్తుంది.

ఈ మండలి అధ్యక్షు ఉపాధ్యక్షులను భారతప్రభుత్వం నియమించుతుంది.

ఈమండలి సభ్యత్వం ఇలా వుంటుంది: ఒకొకదానికి ఇద్దరేసి ప్రతినిధుల చొప్పున భారతదేశంలోని విశ్వవిద్యాలయాల కన్నింటికి ప్రాతినిధ్యం వుంటుంది. రెండేసి స్థానాలచొప్పున ప్రాంతీయదేశాలన్నిటికి ప్రాతినిధ్యంవుంటుంది. దేశంలోని వివిధవిద్యాసంస్థలకూ సాంస్కృతిక సంఘాలకు కలొకస్థానాన్ని కేటాయించుతున్నారు. వివిధనగరాలలోనూ స్థాపించబడే మండలి ఉపసంఘాలన్నిటికి ఒకొకస్థానమూ వుంటుంది.

కార్యవర్గాన్ని ప్రభుత్వమే నియమించుతుంది. దీన్లో 15 మంది అధికార సభ్యులుంటారు. ఈ కార్యవర్గం కనీసం సంవత్సరానికి రెండుదఫాలైనా సమావేశంకావాలి. మండలి సర్వసభ్యసమావేశం సంవత్సరానికి ఒకతూరిజరుగుతుంది.

ఈ మండలి ప్రథమ వార్షికసభ 1950 జనవరిలో జరగాలని తాత్కాలిక కార్యవర్గం నిర్ణయించింది.

ఈ సమావేశంలో ప్రధాని నెహ్రూ, భారతదేశంలోని టర్కీ రాయబారి ఆలీ టర్‌కెల్‌జీ ఇరాన్ రాయబారవర్గసలహాదారు నియామిన్, తూర్పు ఆసియా, మధ్యప్రాచ్య రాజ్యాలప్రతినిధులూకూడా పాల్గొన్నారు.

## ధర్మకర్తృత్వ సంఘ చర్చల బహిష్కారం

### దక్షిణాఫ్రికా ప్రతినిధివర్గ చర్య

లేక్‌సక్సెస్, నవంబరు 26: నైరుతి ఆఫ్రికా భవిష్యత్తును గురించి, దక్షిణాఫ్రికా క్రైస్తవమతాధికారి రెవెరెండ్ మైకేల్‌స్కాట్ యివ్వాళ ధర్మకర్తృత్వ సంఘంలో సాక్ష్యమిస్తాడు కనక, ధర్మకర్తృత్వ సంఘమునకు తాము హాజరయ్యేదిలేదని, దక్షిణాఫ్రికా యూనియన్ ప్రతినిధివర్గం గతరాత్రి ప్రకటించింది.

నైరుతి ఆఫ్రికాపై దక్షిణాఫ్రికా ప్రభుత్వం యింతవరకూ ధర్మకర్తృత్వ పరిపాలన ఛలాయిస్తున్నది. నైరుతిఆఫ్రికా దక్షిణాఫ్రికాలో భాగమేననితాము భావిస్తున్నామని, దీనిని సమితి ధర్మకర్తృత్వ పాలనకు ఒప్పగింతపెట్టే ఉద్దేశ్యము తమకేమాత్రమూ లేదనికూడా దక్షిణాఫ్రికా ప్రతినిధివర్గం ప్రకటించింది.

మైకేల్‌స్కాట్ యివ్వాళ నైరుతి ఆఫ్రికా సమస్యపై ధర్మకర్తృత్వ సంఘంలో సాక్ష్యమివ్వడంతో ఐక్యరాజ్య సమితి చరిత్రలో అపూర్వ అధ్యాయం లిఖింపబడినట్లే. ఇలా ఏ రాజకీయ పంథకు చెందని ఒక సాధారణవ్యక్తి సమితిలో మాట్లాడడానికి అనుమతింపబడటం యిదే ప్రథమపర్యాయం. స్కాట్ ఏవిధమైన ఆవేశం లేకుండా ప్రశాంతంగా, నైరుతి ఆఫ్రికాగురించి తను చెప్పదలచింది చెప్పాడు. హాలులో సభ్యులంతా హాజరైనారు. కొందరు ప్రేక్షకులు స్థలంచాలక నిల్చోవలసి వచ్చిందికూడా. ఏ సభ్యుడూ స్కాట్‌ను ఎదురుప్రశ్న వేయలేదు. 70 నిముషములసేపు స్కాట్ ప్రసంగించాడు. స్కాట్ ప్రసంగం అవగానే, ధర్మకర్తృత్వ సంఘ అధ్యక్షుడు అభివందనం తెలిపాడు. నైరుతిఆఫ్రికా మూగజీవాల తరఫున ఐక్యరాజ్యసమితిలో మాట్లాడడానికి మూడు సంవత్సరములుగా స్కాట్ ప్రయత్నం చేస్తున్నాడు. ఆ ప్రయత్నం యీనాటికి ఫలించినందుకు సభ్యులు ఆయనను అభినందించారు.

నైరుతి ఆఫ్రికా ప్రతినిధులకు, యిక్కడికి వచ్చినవారు చెప్పదలచింది చెప్పటకు వీలు కల్పింపబడకపోవడం మూలంగానే తానిక్కడకు రావలసివచ్చిందని, స్కాట్ అన్నాడు. నైరుతిఆఫ్రికాలోని హిరోరో తెగల మనోభావాలను స్కాట్ వివరించాడు.

## హైదరాబాదు వార్తావళి

హైద్రాబాదు, నవంబర్ 27: ఈనెల 26 నుండీ సంస్థాన ప్రధాన పౌర పరిపాలకుడు డి. యస్. బాక్లే గారు తంతి, తపాలా శాఖను కూడా నిర్వహిస్తారని సరఫరా శాఖ మంత్రి వి. హెచ్. కృష్ణారావుగారు గ్రామ పునర్నిర్మాణ శాఖను కూడా స్వీకరిస్తారని మిలిటరీ గవర్నరు జె. ఎన్. చౌధురీ నేడు ప్రకటించారు.

### ఆర్. ఎస్. ఎస్. లో చేరరాదు

ప్రభుత్వోద్యోగులు ఆర్. ఎస్. ఎస్. లో చేరరాదని సంస్థాన ప్రభుత్వం ఉత్తర్వు చేసినట్లు తెలుస్తున్నది.

### అధికారదత్తత

మిలిటరీ గవర్నరు చౌధురీ నుండి ఎం. కె. వెల్లోడి గారు అధికారం స్వీకరించే సందర్భంలో డిసెంబరు 1 న సాయంత్రం నాలుగు గంటలకు బొలారం విమానాశ్రయంలో "అధికార దత్తత ఉత్సవం" జరుగుతుందని తెలిసింది. 2 వ తేదీన చౌధురి [illegible] క్రొత్తసైనికోద్యోగం స్వీకరిస్తారు.

హైదరాబాదు హైకోర్టు చీఫ్ జస్టిస్, జడ్జీలు నిన్నటిదినం మిలిటరీ గవర్నరుకు వీడ్కోలు విందు చేశారు.

తన బాధ్యతా నిర్వహణలో జడ్జీలు ఎన్నో విధాల తోడ్పడినందుకు అభినందిస్తూ, తానెక్కడవున్నా హైద్రాబాదు వ్యవహారాలను జాగ్రత్తగా గమనిస్తూ వుంటాననీ మేజర్ జనరల్ చౌధురీ అన్నారు.

### పాకిస్తాన్ పోయినవారికి పింఛను రద్దు

ఇదివరలో హైద్రాబాదు ప్రభుత్వోద్యోగాలలో పనిచేస్తూ పాకిస్తాన్‌కు వెళ్లిపోయినవారికి పింఛనులు రద్దు చేసినట్లు ఆపింఛను సైకమును వేరే ఒక ఎక్కౌంటులో చేరుస్తున్నట్లు నేడు తెలిసినది.

### హాకీ వార్తలు

మద్రాసు, మైసూరు విశ్వవిద్యాలయముల జట్లు మొన్న సాయంత్రం ఆడిన హాకీ ఆటలో ఎవరూ గోలులు చేయలేక పోవుటచే ఆట తెగలేదు.

## "మమ్మల్ని ఆంధ్ర రాష్ట్రంలో చేర్చుకోండి"

### అమాత్యులకు సత్యవీడు ఫిర్కా గ్రామాలవారి వినతి

#### శ్రీ గోపాలరెడ్డిగారి అభయం

చెన్నపట్నం, నవంబరు 27: తమ ఫిర్కాలో గ్రామాలు పూర్తిగా తెలుగువారవనీ, ఆంధ్రరాష్ట్రనిర్మాణం జరిగినపుడు తమను ఆంధ్రరాష్ట్రంలోనే చేర్చుకొనవలెననీ నేడు మాదరపాకం మానెల్లూరు గ్రామస్థులు మద్రాసు ప్రభుత్వ ఆర్థికశాఖామాత్యులు బెజవాడ గోపాలరెడ్డిగారికి విన్నవించుకొన్నారు. శ్రీ వేణుగోపాలరెడ్డిగారు అమాత్యులకు స్వాగతం చెప్పిరి. బహిరంగసభకు కత్తె వెంకటస్వామి నాయుడుగారు అధ్యక్షత వహించిరి.

మంత్రి శ్రీ గోపాలరెడ్డిగారు సన్మానపత్రమునకు, వినతులకుసమాధానము ఇచ్చుచూ, తమిళరాష్ట్రంలో ఉన్నా, తెలుగురాష్ట్రంలో ఉన్నా పన్ను చెల్లించే రైతుల ప్రజల హక్కుల రక్షించి, వారి క్షేమానికి పాటుపడటం ప్రభుత్వధర్మమన్నారు. సరిహద్దుల పరిష్కారంచేయుటకు సరిహద్దు సంఘం రాగలదనియు, అప్పుడు వారికి పూర్తి సాక్షి సరంజామాతో ప్రజలు తమను తెలుగు రాష్ట్రంలో చేర్చుకొనుటకు తగిన కారణాలు వివరించుకోవచ్చునన్నారు. సభవారు తామంతా నూటికినూరు తెలుగువారమనీ ఏవిధంగాననా తెలుగురాష్ట్రంలో చేర్చుకోవడం ధర్మమనీ తమను తెలుగు రాష్ట్రంలో చేర్చుకొని న్యాయం చెయ్యవలసిందనీ విన్నవించిరి.

## బాపట్ల తాలూకా కాంగ్రెస్ కార్యవర్గ సమావేశం

బాపట్ల, నవంబరు 22: ఈ తాలూకా కాంగ్రెస్ కార్యవర్గ సమావేశం పుల్లెల రత్తయ్యగారి అధ్యక్షతను నిన్న జరిగెను. దేశభక్త కొండా వెంకటప్పయ్య పంతులు కవిబ్రహ్మ, ఏటుకూరి వెంకట నరసయ్యగార్ల మృతికి విచారము వెలిబుచ్చుచును, తుపానువల్ల సంభవించిన ఆస్తినష్టం ప్రాణనష్టములకు విచారము, సానుభూతి వెల్లడించుచూ, బాధితుల సహాయార్థం తాలూకా ప్రజ శక్తి వంచనలేకుండా ధన, ధాన్యవస్తు ఇతర రూపేణా విరివిగా విరాళములు నివ్వవలెనని, విజ్ఞప్తి చేయుచు, గ్రామకాంగ్రెసు సంఘాలు, తాలూకా కాంగ్రెసు సభ్యులు ఈ విషయంలో ప్రత్యేక శ్రద్ధ వహించవలెనని కోరుచు తీర్మానాలు చేసిరి. ఇటీవల జరిగిన జిల్లాబోర్డు ఎన్నికలలో కాంగ్రెసుకు వ్యతిరేకంగా ప్రచారము చేసి, కాంగ్రెసు అపజయమునకు కారణభూతులైన అధికార కాంగ్రెసువారలపై తక్షణం గట్టి శిక్షణచర్య తీసికొనవలెనని రాష్ట్రకాంగ్రెసును కోరుచు ఒక తీర్మానం చేసిరి. సెప్టెంబరులో వచ్చిన వరదవల్లను, అక్టోబరులో వాటిల్లిన తుపాను వల్లను పాడైపోయిన పంట భూములకు పూర్తి రిమిషన్ యిస్తూ, పేదరైతులకు, వ్యవసాయకూలీలకు యింటికలప, యెరువులు, విత్తనములు, వ్యవసాయ పనిముట్లు ఉచితంగా సరఫరా చేయుటకు వెంటనే ఉత్తర్వులు యివ్వవలసినదిగా ప్రభుత్వమును కోరుచూ ఒక తీర్మానము, ఆంధ్ర రాష్ట్ర నిర్మాణంవిషయంలో రాష్ట్రకాంగ్రెసు సంఘం చేసిన సముచిత నిర్ణయమును ఫలోన్ముఖమొనర్చుటకు కనపరచిన సమైక్యతాభావమునే తుపానుబాధితులకు సహాయముచేయుటలోనూ, ఆంధ్రరాష్ట్రసత్వర సర్వతోముఖాభివృద్ధికి కృషి చేయుటలోనూ చూపించగలరని ఆశించుచూ ఒక తీర్మానముచేసిరి.

# "హైద్రాబాద్ భవిష్యత్తును సంస్థాన పరిషత్తు యథేచ్ఛగా నిర్ణయిస్తుంది"

## స్వామీ రామానందతీర్థ వివరణ

### "భారత రిపబ్లిక్ అవతరణానంతరం మాత్రమే కేంద్రశాసనసభలో ప్రాతినిధ్యం సంభవం"

(స్వకీయ విలేఖరి)

హైద్రాబాదు, నవంబరు 26: "భారత రాజ్యాంగపరిషత్తులో హైద్రాబాదుకు ప్రాతినిధ్యం కలిగే అవకాశం ఇప్పుడుగాని, సమీప భవిష్యత్తులో గాని లేదని ప్రస్తుత రాజకీయపరిస్థితిని బట్టి స్పష్టపడుతున్నది. కాని భారత రిపబ్లిక్ అవతరించిన పిమ్మట ఏర్పడే భారత శాసనసభలో ఈ సంస్థానానికి ప్రాతినిధ్యం లభించవచ్చును." అని సంస్థాన కాంగ్రెసుఅధ్యక్షుడు స్వామీ రామానందతీర్థ నేడుచెప్పారు.

ఆంధ్రపత్రిక విలేఖరితో మాట్లాడుతూ స్వామీజీ "భారతరాజ్యాంగ పరిషత్తుకు ఈ సంస్థానంనుండి ప్రతినిధులను పంపించాలన్న సమస్య ఈ నెల ప్రారంభంలో ఇక్కడికి వచ్చిన వి. పి. మీనన్‌గారితో చర్చించబడనేలేదు." అనికూడా చెప్పారు. స్వామీజీ నేటి ఉదయమే మద్రాసు నుండి ఇక్కడకు విమానంలో వచ్చారు.

హైదరాబాదు రాజ్యాంగ పరిషత్తు సర్వతంత్రస్వతంత్రమైనదేనా? అని ప్రశ్నించగా భారత రాజ్యాంగ పరిషత్తు తప్ప మరేదీకూడా సర్వతంత్ర స్వతంత్రం కాదని, భారతరాజ్యాంగవ్యవస్థకులోబడిన స్వాతంత్ర్యం మాత్రమే మిగతావాటికి ఉంటుందని స్వామీజీ జవాబిచ్చారు.

రాబోయే సంస్థాన పరిషత్తు ఏవిషయాలను నిర్ణయిస్తుంది అని అడిగ్గా, ఈ విషయమై భారత సంస్థాన శాఖ ఏమి నిశ్చయించిందో తనకు తెలియదని, కాని సంస్థాన పరిషత్తు చేసే నిర్ణయాలన్నీ కేంద్రప్రభుత్వంచే ఆమోదింపబడవలసి వుంటుందనిమాత్రం తాను చెప్పగలననీ స్వామీజీ అన్నారు.

"కాని హైదరాబాదు భవిష్యత్తును గూర్చి, ఇండియాతో దాని సంబంధాలను గూర్చి, నిజాంభవిష్యత్తునుగూర్చి సంస్థాన పరిషత్తు స్వేచ్ఛగా నిర్ణయాలు చెయ్యవచ్చు. ఈ విషయాలను సంస్థాన కాంగ్రెసు, ప్రభుత్వమూ త్వరలో ఇర్పిస్తారు." అని కూడా ఆయన చెప్పారు.

భారత కాంగ్రెసుకు సంస్థాన కాంగ్రెసును అనుబంధంచేసే విషయమై అభిప్రాయభేదాలున్నాయా అని ప్రశ్నించగా, ఈ విషయంలో అందరికీ ఏకీభావం కుదిరిందని ఆయన అన్నారు. నిజాం ఫర్మానాను తాను పూర్తిగా చదివాననీ, భారత రాజ్యాంగమును ఈ సంస్థానంలో అమలు చేయడానికి గాను నిజాం చే తాత్కాలికంగామాత్రమే భారతరాజ్యాంగమును ఆమోదింపజేయడం జరిగిందనీ, కూడ ఆయన అన్నారు.

సంస్థానకాంగ్రెసు అంతర్విభేదాలు త్వరలో సమసిపోగలవని తనకు నమ్మకమున్నదనీ, సంస్థానకాంగ్రెసు ఎన్నికలు పూర్తయినతర్వాత ఈ విభేదాలు అంతరిస్తాయని తాను చెప్పినట్లు పత్రికల్లో ప్రకటితమైనవార్త సరియైనదికాదనీ ఆయన చెప్పారు.

సంస్థానకాంగ్రెసు కార్యవర్గం నవంబరు 30 వ తేదీన అసాధారణ సమావేశం జరుపుతుందనీ, గుల్బర్గజిల్లా ఎన్నికలతగాదానుగూర్చి, సంస్థానకాంగ్రెసు అధ్యక్ష ఎన్నికలతేదీ నిర్ణయాన్ని గూర్చి ముఖ్యమైన చర్చలు జరుగుతాయనీ కూడా స్వామీజీ చెప్పి సంభాషణ ముగించారు.

(సంస్థాన కాంగ్రెసులోని రెండుపోటీ వర్గాలమధ్య ప్రస్తుత ప్రధాన అభిప్రాయభేదం గుల్బర్గ ఎన్నికలను గూర్చే. సంస్థాన కాంగ్రెసు చే నియమింపబడిన ఎన్నికల అధికారిని కర్నాటక రాష్ట్రీయ కాంగ్రెసువారు తొలగించి వేరే ఎన్నికల అధికారిని నియమించినందువల్ల గుల్బర్గలో ఎన్నికలను నిలిపివేస్తూ అధ్యక్షుడు స్వామీ రామానందతీర్థ ఉత్తర్వు చేశారు. దీనితో ఇరువర్గాలమధ్య తగాదా రేగినది) స్వ.వి.

## ప్రవేశపత్రంపై నిజాం దస్కతు చేయలేదు.

హైదరాబాదు, నవంబరు 26: ఇండియాలో హైదరాబాదును చేరుస్తూ నిజాం నవాబు ప్రవేశపత్రం మీద సంతకం పెట్టలేదని ఇప్పుడు అధికారికంగా ధ్రువపడినది. భారత రాజ్యాంగపరిషత్తు ఆమోదించిన రాజ్యాంగమును మాత్రమే ఆయన అంగీకరించారు. ఈ అంగీకృతికి అర్థం హైదరాబాదు ఇండియాలో చేరినట్లేననీ, నిజాం ప్రవేశపత్రం మీద సంతకం పెట్టనవసరం లేదనీ, ఆగస్టు 15 తరువాత చాలమంది సంస్థానాధీశులు ఇలాగే చేశారని కూడా విజ్ఞులు భావిస్తున్నారు.

స్వ. వి.

## ఫ్రెంచి ఇండియాలో జనవాక్య నిర్ధారణ

### తేదీ నిర్ణయించవలెనని డా॥ రాజకుమార్

న్యూఢిల్లీ, నవంబరు 26: భారతదేశమునందలి ఫ్రెంచి భూభాగములలో జనవాక్య నిర్ధారణకు తేదీ నిర్ణయించినగాని అచ్చటి పరిస్థితులు స్పష్టమైన రూపము దాల్చవని, సాధ్యమైనంత త్వరలో జనవాక్య నిర్ధారణ తేదీ నిర్ణయించవలెనని ఫ్రెంచి భూభాగముల ప్రజలు కోరుచున్నారని కాంగ్రెస్‌పై దేశీక శాఖ కార్యదర్శి డా॥ రాజకుమార్‌గారు చెప్పిరి. వీరు మూడువారముల పర్యంతరము ఫ్రెంచి భూభాగములలో పర్యటించి అచ్చట స్థితిగతులను తెలిసికొని తిరిగి వచ్చిరి.

ఫ్రెంచి భూభాగములలో అధికారుల ప్రేరేపణపై చాలా ప్రచారము జరుగుచున్నదని, దీనిని అరికట్టుటకు మార్గము లేదని, పర్యవేక్షకులు వచ్చి సాధ్యమైనంత త్వరలో పని ప్రారంభించుటవల్లనే ఈ ప్రచారము అగగలదని ఆయన చెప్పెను. వోటర్ల పట్టికలను సంస్కరించి వాటిలో అర్హులైన వోటర్లనందరిని చేర్చుటగూడ ముఖ్యమని రాజ్‌కుమార్‌గారనిరి. వోటర్ల పట్టికలను మార్చుపని ఫ్రెంచివారి ఆధ్వర్యమున జరిగే యెడల అసలు వోటర్ల పట్టికలను మార్చవలెనను కోర్కెనే మాని వేయుట ఉత్తమమని ఆయన చెప్పెను.

ఫ్రెంచివారి మూడు పట్టణములలో స్థితిగతులు ఎట్లున్నవని యడుగగా యితర ప్రదేశములకంటె పుదుచ్చేరిలో యెక్కువ చిక్కు పరిస్థితి యేర్పడి యున్నవనిరి. ఇందుకు కారణము పుదుచ్చేరి రాజధాని యగుట, స్వలాభాపేక్షకులుండుటయనిరి. కరైకలులో జాతీయవాదులలో చీలిక యేర్పడి యుండెనని, తాను వివిధవర్గముల వారిని ఏకము చేసి, భారతదేశములో ఫ్రెంచి భూభాగములు లీనమై పోవలెనను వారందరితోకూడిన క్రొత్తపక్షము నొకదాని నేర్పరిచెనని ఆయన చెప్పెను.

1948 సం॥ములో మాహేలో జరిగిన సంఘటనలవల్ల జాతీయవాదులు మాహే వదలివెళ్లవలసిన వారగుటచేత మాహేలో చిక్కు పరిస్థితి యేర్పడెననిరి. మాహే వదలివెళ్ళిన వారినందరిని వోటుచేయనిచ్చినగాని అచ్చటి జనవాక్యనిర్ధారణ న్యాయముగా జరగదనిరి. వారు మాహేను వదలి పెట్టి వెళ్లుట అనాలోచితమని అంగీకరించినప్పటికి తమ భవిష్యత్తుకు సంబంధించిన ముఖ్యవిషయములో వారికి వోటు చేయు అధికారము లేకుండా చేయరాదనిరి:

తన నిర్ణయములను డా॥ రాజ్‌కుమార్ గారు అధికారులకు తెలియజేసెదరు.

## పర్షియా - ఇరాక్ వైమనస్యాలు

### ఇరాకీలు వెళ్లిపోవాలని పర్షియా ఉత్తర్వు

టెహరాన్, నవంబరు 26: పర్షియాలో ఉన్న ఇరాకీ పౌరులంతా 14 రోజులలో దేశంవిడిచి వెళ్లిపోవాలని ఉత్తర్వు చేయుటానికి పర్షియా ప్రభుత్వం నిశ్చయించినట్లు నేడు ప్రకటించబడినది. మూడు నెలలనుంచి ఇరాక్‌లోని పర్షియన్ పౌరులమీద జరుగుతున్న అత్యాచారాలకిది ప్రతిక్రియ అని ఆ ప్రకటన వెల్లడించింది; ఇది కేవలం రాజకీయ ప్రతిక్రియే కాని సెమైటిక్ జాతి (అరబ్, యూదు)కి ప్రతిక్రియ కాదని వివరించబడినది.

పర్షియాలో 2 వేల మంది ఇరాకీలు ఉండగా, ఇరాక్‌లో 150 వేల మంది పర్షియన్లు ఉన్నారు.

## "శీలము పెంపొందించడమే విద్యాదర్శము"

### ఇండియా ఆహార మంత్రి ఉద్ఘాటన

న్యూఢిల్లీ, నవంబరు 26: ఇండియా వ్యవసాయాహారమంత్రి జయరామ్‌దాస్ దౌలత్‌రామ్ ఈ వేళ కేంద్ర వ్యవసాయ కళాశాలలో సాంవత్సరికోత్సవంలో మాట్లాడుతూ శీలం అభివృద్ధి చెయ్యడమే విద్యాదర్శమని అన్నారు.

ఈ కళాశాల 1947 లో స్థాపించారు. దీనిలో కేంద్రపాలిత ప్రాంతాల విద్యార్థులకు, వ్యవసాయ కళాశాలలులేని రాష్ట్రాల విద్యార్థులకు వ్యవసాయ శిక్షణం ఇస్తారు. ఇందులో 172 గురు విద్యార్థులున్నారు.

జయరామ్‌దాస్ దౌలత్‌రామ్ తమ ఉపన్యాసంలో ఈకళాశాల ఇంతలో ఎత్తివేసే ఆలోచన ఏమీలేదనీ, అలాగ యెత్తివేసే పక్షంలో విద్యార్థులకు ఏ విధమైన అపకారము జరగకుండా చూడగలమని అన్నారు.

## పాకిస్తాన్‌ప్రధాని మాస్కో ప్రయాణ సమస్య

లండను, నవంబరు 26: పాకిస్తాను ప్రధాన మంత్రియగు లియాకతాలీఖానుగారిని రష్యాకు రావలసినదిగా రష్యా ప్రభుత్వం ఆహ్వానించెను. పండిట్ నెహ్రూ ఇటీవల అమెరికాకు వెళ్లినప్పుడే యీ ఆహ్వానం లియాకతాలీఖానుకు వచ్చెను, కాని అమెరికాకు రావలసిందిగా అమెరికా ప్రెసిడెంటయిన ట్రూమనువద్దనుండి కూడా ఆహ్వానమువచ్చెను.

రష్యాతో పాకిస్తానుకు రాయబార సంబంధములు ముందుగా ఏర్పడితేనే తప్ప రష్యాకు లియాకతాలీఖాను వెళ్లుటకు వీలులేదు. అందువల్ల పాకిస్తానులో రష్యను రాయబారియును, మాస్కోలో పాకిస్తాను రాయబారియును ముందుగా వెలయవలెను.

ఈ ఏర్పాట్లు పూర్తియైన పిమ్మటనే లియాకతాలీఖానుగారు అమెరికాకు వెళ్లెదరు. అనంతరము రష్యా వెళ్లెదరు.

## ఒరిస్సా ప్రధానికి రూ 51 వేలు కానుక

కటకం, నవంబరు 26: ఒరిస్సా ప్రధాని హరికృష్ణ మెహతాబుగారికి నేడు 50 సంవత్సరములునిండి 51 సంవత్సరం ప్రారంభమైనది. నేడు వారి జన్మదినోత్సవ మగుటవల్ల వారికి 50 సంవత్సరములు నిండినందున సువర్ణోత్సవము జరుపుటకై ఏర్పడిన కమిటీ వారికి రూ 51 వేలు ఒక నిధిగా సమర్పించెను.

మెహతాబుగారు అందులో సగం మొత్తమును గాంధిమహాత్మున కత్యంత ప్రియమైన హరిజన ఆదిమవాసి ఉద్ధరణకై వినియోగింప బడుటకును, మిగిలినసగము అనేక అముద్రిత ఉత్కళభాషా గ్రంథములను ముద్రింపజేయునిమిత్తం ఉత్కళ విశ్వ విద్యాలయమునకును యివ్వబడునని మెహతాబుగారు బహిరంగసభలో ఆ కానుకను స్వీకరించినప్పుడు చెప్పిరి. తాను యీ ప్రధానమంత్రి పదవిలోనుండగా యివ్వబడిన కానుకల నన్నింటిని ఉత్కళ విశ్వవిద్యాలయమునకు యిచ్చెదననిరి.

## రైల్వే ఫలహారశాలలో పంచదార వాడకం

మద్రాసు, నవంబరు 27: యం. యస్ యం అండ్ యస్. ఎ. రైల్వే ప్రజా సంబంధపు ఉద్యోగి ఈ క్రింది ప్రకటన చేయుచున్నారు.

పంచదారకు ఎద్దడి ఏర్పడినందునను పరిస్థితులు మారునవరకు యం. అండ్. యస్. యం రైల్వే యాజమాన్యమున నడిచే ఫలహార శాలలలో తీపివస్తువులు దొరకవు. బొంబాయి రాష్ట్రములో హుబ్లి, మీరజ్, లోండా, బెల్గాం, ఫలహారశాలలలోను, ఫలహార శకటములలోనూ పానీయములకు పంచదారబదులు బెల్లము వాడెదరు. మిగిలిన ఫలహారశాలలలోనూ, ఫలహార శకటములలోనూ కాఫీలో ఇప్పటికన్న పంచదార తక్కువ వేసెదరు. అసాధారణ పరిస్థితులలో చేసిన ఈ తగ్గింపును ప్రజలు సహించవలెనని కోరుచున్నాము.

## లక్ష ఎకరాలభూమి అదనపుసాగు

త్రివర్ష అధికాహారోత్పత్తి పథకం క్రింద హైదరాబాదు ప్రభుత్వం 1952 కల్లా లక్ష 6 వేల ఎకరాల బంజరుభూమిని సాగుచేయించగలదనీ, దీనికి మొత్తం 9 కోట్లు రూ॥ వ్యయం కాగలదనీ, అయితే ప్రస్తుతానికి 2 కోట్లు రూపాయలనే ప్రభుత్వం మంజూరు చేసిందనీ తెలిసింది.

## రేషనింగు ఆఫీసరుపై లంచగొండినేరారోపణ

### నిందితునికి రు. 200/-లు జరిమానా

ఏలూరు, నవంబరు 23: రేషనింగు ఆఫీసర్‌గావుండి అధికార హోదాలో అక్రమ ప్రతిఫలములను గ్రహించెననీ, శ్రీరామమూర్తిగారిపై తేబడిన కేసులో పశ్చిమ గోదావరిజిల్లా సెషన్సుజడ్జీ సి. డి. తులసీరామ్ ముదలియార్ గారు నిందితుడు దోషి అని తీర్పు చెప్పిరి.

ప్రాసిక్యూషన్‌వారి కథనం ప్రకారం నిందితుడు శ్రీ రామమూర్తి 14-2-1947 నుండి 3-1-48 వరకూ ఏలూరులో రేషనింగ్ ఆఫీసర్‌గా పనిచేశారు. 1948 జనవరిలో రేషనింగ్ ఎత్తివేస్తారనువార్త తెలియగానే, ఈ లోగానే, నిందితుడు ఏలూరులోని హోటలు యజమానులను, కాఫీహోటలు యజమానులను, వారి జమాఖర్చులు సరిగా లేవని, తప్పులున్నవనీ, వారివద్ద రేషను ద్రవ్యముల నిలవలు అధికముగాయున్నవనే నెపములమీద వారిని బాధపెట్టి, వారివద్దనుండి అక్రమ ప్రతిఫలమును పొంద ప్రయత్నించారు. ఈ విధంగా ఒక తరుణంలో ముగ్గురివద్దనుండి చెరి రూ. 50/-లు, రెండవ తరుణంలో, ఒకరివద్దనుండి రూ. 50/- ఇంకొకరి వద్దనుండి రూ. 40/- మరొకరివద్దనుండి రూ. 75/-లున్నూ మూడవతరుణంలో మరికొన్ని మొత్తములు పొందుటకు ప్రయత్నించి కొన్ని మొత్తములు తీసికొన్నారు. ఇదిగాక కొందరివద్దనుండి ఉచితముగా భోజనము, ఫలహారములు తీసికొన్నారు. ఈ విధంగా తమ అధికారపదవిని దుర్వినియోగం చేశారు.

నిందితుడు నిర్దోషినని వాదంచెను. జడ్జిగారు తీర్పులో, నిందితుడు ద్రవ్య రూపమైన అక్రమ ప్రతిఫలములు తీసికొనెననే ఆరోపణలను ప్రాసిక్యూషన్‌వారు పూర్తిగా రుజువుచేయలేక పోయిరని గాని నిందితుడు ఖరీదు యివ్వకుండా భోజనమూ, ఫలహారములు ఉచితంగా పొందుచుండెననుట రుజువైనదనీ, ఈ విధంగా అతడు తీసికొనుటవల్ల అక్రమ ప్రతిఫలము పొందుట అనే నేరము చేసినట్లు తేలుచున్నదని కనుక నిందితుడీ విషయంలో ఇం. పి. కో. 161వ సెక్షన్ ప్రకారము దోషిఅని పేర్కొనిరి,

శిక్ష విధించే విషయంలో నిందితుడిట్టి నేరము చేయుటకిదే ప్రథమ పర్యాయము గనుకనూ, అతడిప్పుడు ఉద్యోగములో లేనందుననూ రు200/లు జుల్మానా విధించితిమనిరి. అది చెల్లింపనిచో 6 నెలల కఠినశిక్ష అనుభవింపవలెనని యుండుననిరి.

నిందితునితరఫున గుంటూరు వీరరాఘవులు, ప్రాసిక్యూషను తరఫున పబ్లిక్ ప్రాసిక్యూటరు ఆర్. వి. రామారావు, బడేటి వెంకటరత్నంగార్లు వాదించిరి.

## ఫ్యాక్టరీ కార్మికుల దర్యాప్తు సంఘం

ఫ్యాక్టరీ కార్మికుల అసలు జీతాలను కరువుభత్యములను నిర్ణయించే విషయమును కుటుంబవ్యయమును గూర్చిన లెక్కలను క్రమపద్ధతిలో సేకరించే మార్గాలను, కార్మికుల జీవనస్థితిగతులను, దర్యాప్తు చేయుటకై నియమింపబడిన సంఘంవారు తమ ప్రథమ దాఖలు ముగించారు. కార్మిక శాసన నిర్మాణమును గూర్చి వారు ప్రభుత్వమునకొక తాత్కాలిక నివేదికను సమర్పించారు.

## గవర్నరుగారికి పౌరసన్మానమిచ్చుటకు పురపాలకసంఘ నిర్ణయం

డిసెంబరు 12 వ తేదీని ఇక్కడికి రానున్న మద్రాసు గవర్నరుగారికి వారి సరికి హిందీభాషలో స్వాగతపత్రము సమర్పించుటకూ, అందు నిమిత్తం రు 500/- ఖర్చు చేయుటకూ, ఈ పురపాలక సంఘమువారు ఈ మధ్యాహ్నం జరిగిన సమావేశంలో తీర్మానించారు. స్వాగత పత్రం ముసాయిదా తయారు చేసేందుకు ఒక ఉపసంఘాన్ని కూడా నియమించారు. సమావేశానికి సంఘ ఉపాధ్యక్షుడు డా॥ దుగ్గిరాల రాజేశ్వరరావుగారు అధ్యక్షత వహించారు.

సమావేశపు అజండాలో సుమారు 76 అంశాలున్నాయి. ఈఅంశాలలో 11వ దిగా ఉన్నప్పటికీ, కౌన్సిలు కాంగ్రెస్ పార్టీ కార్యదర్శి కోటే పుట్టయ్యగారు దీనిని మొదటే చర్చించాలని ప్రతిపాదించగా కట్టా సుబ్బారావుగారు బలపర్చారు. ఏకగ్రీవంగా ఆమోదింపబడింది. ఈ విధంగానే అజండాలో అచ్చటచట ఉన్నటువంటి మరి 6 విషయాలు చర్చించి తీర్మానించినపిమ్మట ఆయిగ్వారి ప్రతిపాదనపైనే సమావేశం రేపు సాయంకాలానికి వాయిదా పడెను. కౌన్సిలు వారామోదించారు. నేటి సమావేశంలో ముక్కెవెల్లి, వీరమాచనేని వెంకటనారాయణగార్లు సభ్యత్వములను పునరుద్ధరించుట, వెంకటేశ్వర టూరింగ్ టాకీస్‌వారి ఆయిల్ యింజనుకు అనుమతియిచ్చుట జరిగినవి.

## విశాఖపట్నం లేఖ:

# వరద, తుపానులవల్ల ప్రజలకు కలిగిన ఇబ్బందులు - కాంగ్రెస్ పెద్దల మంత్రుల శీతకన్ను - తపాలా అసౌకర్యాలు

['ఆంధ్ర పత్రిక' ప్రతినిధి]

జిల్లాలో వరద ఉపద్రవముతో ఆర్థిక జీవనము పూర్తిగా తారుమారైనది. ఒకనెల వ్యవధిలో రెండు తుపానులు-దక్షిణ విశాఖజిల్లా-పంటతాలూకాలు - సర్వసిద్ధి-అనకాపల్లి, పంటభూములనూ, తోటలనూ, ధ్వంసంచేసినవి.

విలాసవస్తువుల విలువలు అటుంచి, నిత్యావసర పదార్థముల ధరలు నూటికి నూరు పెరిగాయి. రేషను బియ్యముకాక, సేరు 1 కి 0-12-0 నుంచి 0-14-0 అణాలవరకు ఇస్తే బియ్యం సరఫరా అయ్యేవి, అవీ మృగ్యమయినవి. చెరుకు తోటలు పాడు అవటంవల్ల బెల్లం ధర వీశ రూ 2-8-0 వరకూ పెరిగింది. చింతపండు రూ 1-8-0. ఉల్లిపాయలకు ప్రసిద్ధి నొందిన విశాఖజిల్లాలో ఇప్పుడు ఉల్లిపాయలు వీశ 0-12-0 అణాలూ, 0-14-0 అణాలూ అమ్ముతున్నాయి. కాకరకాయలు వీశ రూ 1-2-0, అరటికాయ ఒకటి 0-2-0. వంకాయలు వీశ రూ 1-0-0, మత్స్య మాంసాదుల ధరలు మరీ దారుణంగా పెరిగిపోయాయి. వరదవచ్చినప్పటినుంచీ, చేపలు అసలు దొరకటమే లేదట. గొర్రెలూ, మేకలూ, వరదలోపోగా మిగిలిన వాటికి ధర నూరింతలు పెరిగింది. ఈ ఆర్థిక [illegible] ప్రజలు, ప్రభుత్వము ఎలా [illegible] గ్గొంటారో ప్రశ్నార్థకంగా వుంది.

జిల్లాలో కార్మిక జనాభా 40 వేలు దాటుతుంది. వీరి ముఖ్యభోజన పదార్థములు - బియ్యపు నూకలూ, రాగులూ, జొన్నలూ: ఈ సంకటి కూడు తింటారు [illegible] వరులూ, మిరపకాయలూ, ఉల్లిపాయలూ, చింతపండూ. మిరపకాయల ధర వీశ రూ 2-4-0 అయింది. పచ్చి మిరపకాయలు అణాకి నాలుగు ఇస్తున్నారు.

జిల్లా సెంట్రలు [illegible] భోజన పదార్థాల [illegible] సరిపోవడం లేదు.

వీనికి తోడు బజారులలో ఇప్పుడు బిస్కెట్లు, రొట్టెలూ, మొదలైనవి ప్రబలమైనాయి. ఈ వారంలో స్థానిక పోలీసులు ఇప్పుడు కొన్ని చోట్ల సరుకులు అమ్ముతున్న 10 మంది వర్తకులను అరెస్టు చేశారు. వరద నీరు పంపు [illegible] చెరువులలోకీ, నూతులలోకి రావటం వల్ల ఆ నీరు త్రాగటం, రేషను బియ్యం తినడం మూలంగా ప్రజల ఆరోగ్యం దెబ్బతింటోంది. కలవారూ లేనివారూ కూడా ఉదర వ్యాధులతోనే ఒంటి నిండా పుళ్లలతోనే బాధపడుతున్నారు.

ఇది ఇలా వుండగా కొద్దిరోజులలో ఇప్పుడు ఇస్తున్న 8 ఔన్సుల బియ్యం రేషను 6 ఔన్సులకు తగ్గిస్తారనీ జనవరినుంచి 4 ఔన్సులు చేస్తారనీ ప్రబలిన వదంతులు ప్రజలను భీతావహ పరుస్తున్నవి.

### మంత్రుల శీతకన్ను

మంత్రులూ, కాంగ్రెస్ పెద్దలూ ఉత్తర జిల్లాలన్నిటిలోనూ సంచారము చేశారు. వరద, తుపాను భీభత్సంవల్ల ప్రజలకు కలిగిన కష్టాల, నష్టాల వివరాలు తెలుసుకొని ఏదో ప్రయత్నిస్తున్నారు కాని ఆ పెద్దలు ఎవ్వరూ ఈ జిల్లాకు మాత్రంరారు. పర్యటనా చేయరు. ప్రజల ఘోష వినరు. ఈ జిల్లాలో ఏ సమస్యనూ ప్రభుత్వము ఇంతవరకూ సమగ్రంగా పరిశీలించి ఏ ఉపకారమూ చేసినట్లు కనపడదు.

### దొంగతనాలు

జిల్లాలో ఆర్థికోత్పాతమునకు తోడు-దొంగతనాలు ఎక్కువ అయినవి. ఇళ్లు తలుపులు పగలగొట్టటం, దోపిడీలు చేయడం ఇంకా ఎన్నో చిలిపి దొంగతనములూ ఎక్కువ అయినాయి. ఇవి చిన్న పిల్లలు చేస్తున్నట్లు తెలిసింది. పెద్దవారు 10, 12 సంవత్సరముల వయస్సుకల కుర్రవాళ్లను చేరతీసి చిలిపి దొంగతనములు చేయిస్తున్నారట. ప్రభుత్వము వీరిని పట్టుకొని విద్యాబుద్ధులు నేర్పే ఏర్పాట్లు చేయడం చాలా అవసరం.

### తపాలా అసౌకర్యాలు

ఈ పట్టణంలో తపాలా సౌకర్యములు మృగ్యమనే చెప్పవచ్చును. ఇదివరకు 1-20 నిమిషములకు ఇక్కడకు వచ్చే మద్రాసు మెయిలు అక్టోబరు 1 తేదీ నుంచి సాయంత్రము 4 గంటలకువస్తూంది. అందువల్ల తపాలా బట్వాడా - మరుసటి దినము. 10-30 గంటలకూ, 11 గంటలకూ జరుగుతున్నది. దీనికితోడు -రోజూవుండే విమాన సర్వీసు వారమునకు మూడురోజులగా మారింది. తపాలు అందుకుని వెంటనే జవాబు ఇవ్వగల అవకాశము ఏమాత్రము లేదు. ఉదయం 10-30, 11 గంటల మధ్య తపాలా అందచేస్తారు. ఉదయం 10-30 గంటలకు పోస్టు ఆఫీసులకన్నా 9-30 గంటలకు ఎక్కువ తపాలా డబ్బాలకన్నా తపాలా రవాణాకు తీసివేస్తారు. మద్రాసువైపునుంచి, తపాలు రావటమునకు మూడురోజులూ, ప్రత్యుత్తరము పంపటమునకు మూడురోజులూ పడుతూంది. మద్రాసులో 11 వ తేదీని విమానటపాలో వేసిన కవరు 14 వ తేదీ ఉదయం 11 గంటలకు అందింది.

ఇంతకూ తపాలు బట్వాడా చేయడమునకు విశాఖపట్నములోనూ నాలుగు పోస్టాఫీసులు పనిచేస్తున్నాయి. ఇదికాక మూడు ఎక్సుపెరిమెంటు ఆఫీసులున్నాయి. ఇంత వ్యయం అవుతూన్నా ప్రజలకు మాత్రం సౌకర్యం ఏమీలేదు.

# బందిపోటు దొంగ

## ఘాతుకకృత్యం

కలకత్తా, నవంబరు 26: నిన్న రాత్రి ఒక బందిపోటు దొంగకు కారుడ్రైవరుకు జరిగిన పోరాటం ఇక్కడి టోలీగంజ్ పోలీసుస్టేషనులో తెలిసింది.

నిన్న బాగా వేషంవేసుకున్న యువకు డొకడు టాక్సీని పిలిచి అదాబ్పూర్ వెళ్ళాలని అడిగాడట.

అదాబ్పూరు వెళ్ళిన తరవాత ఆ పెద్ద మనిషి టాక్సీ డబ్బు ఇవ్వకుండా వెళ్ళి పోతూంటే, టాక్సీ డ్రైవరు అతన్ని డబ్బు ఇమ్మని అడిగాడట. ఆపైన ఆ యువకుడు తటాలున ఒక పిస్తోలు పైకితీసి డ్రైవరును తనదగ్గర ఉన్న డబ్బంతా ఇమ్మని అడిగాడట. ఆపైన ఆ డ్రైవరు ఇచ్చిన డబ్బుతో తృప్తిపడక అతడు గాలి లో పిస్తోలు పేల్చాడట. ఈ సమయంలో ఆ డ్రైవరు అమాంతంగా అతనిమీదపడి, అతన్ని పట్టుకు నిగట్టిగా కేకలు వేశాడట. కాని నలుగురు వచ్చేలోగా ఆ యువకుడు ఆ పిస్తోలు అక్కడ విడిచి, అతన్ని తప్పించుకుని పారిపోయాడని తెలుస్తున్నది.

## ఫోర్టుమ్యూజియంలో పురాతన నాణెములు

మదరాసు, నవంబర్ 27: ఫోర్టు మ్యూజియంలో ఇటీవల మరి కొన్ని పురాతన నాణెములు కూర్చబడెను. వానిలో 26 నాణెములు ఈస్టు ఇండియా కంపెనీవారి కాలూకు 1728 1881 సంవత్సరములకు సంబంధించినవి. విక్టోరియా మహారాణినాటి సింహళనాణెములు 7 వున్నవి. 1881 సం॥ము నాటి పోర్చుగీసు ఇండియా నాణెములు 1880 సం॥పు హాంకాంగ్ నాణెము 1 సెంటు విలువగలది ఒకటి వున్నది.

## బళ్లారిలో పాకిస్తాను కాందిశీకుల పునరావాసము

బళ్లారి, నవంబరు 27:

గతమాసం ఆవడినుండి ఇక్కడికివచ్చిన 93 మంది సింధుప్రాంత కాందిశీకులకూ, పునరావాసపు ఏర్పాట్లు పూర్తిఅయ్యెను. జిల్లా కలెక్టరు న వి. నూగవనంఅయ్యరు, డెప్యూటీ కలెక్టరు, వి. పున్నయ్య నాయుడు, తాసిల్దారు జంపాల జగన్నాథ రావు, అసిస్టెంటు తాసిల్దారు రుద్రప్ప గార్లు కాందిశీకులను పాత మునిసిపాలిటీ భవనములో దింపి, వీరి సౌకర్యములను తనిఖీచేయుచున్నారు. నేటివరకు రూ. 12,000/-ఋణమిచ్చిరి. కాందిశీకులు ఈ ధనముతో ధాన్యపు అంగళ్లు, బట్టలకొట్లు, కుట్టుపని మున్నగు వ్యాపర్తులు ఏర్పరచుకొనుచున్నారు. (స్వ. వి.)

## ప్రొద్దుటూరు పురపాలక సంఘ సమావేశము

ప్రొద్దుటూరు, నవంబరు 24: ఈ పురపాలక సంఘ అత్యవసర సమావేశమొకటి నిన్న చైర్మన్ పా. ఎర్రమునిరెడ్డిగారి అధ్యక్షతను జరిగెను. పరిపాలనా నివేదికపై స్థానిక సంస్థల ఇన్‌స్పెక్టరుగారి సమీక్షను, ఆ సమీక్షను జాగ్రత్తగా పరిశీలించవలెనని చైర్మన్‌గారు ఆఫీసు మేనేజరును కోరే తాఖీదునున్నా రికార్డు చేసి కొన్నారు. ఈ మునిసిపాలిటీకి ఇంజనీరు అక్కరలేదని, ఒక ఓవర్‌సీరును నియమించుకోవచ్చునన్న ప్రభుత్వ ఉత్తరువును రికార్డు చేయుచు, యిచ్చట పనులు సక్రమంగా, త్వరగా జరగడానికి ఒక ఇంజనీరు అత్యవసరమని, అట్లు ఇంజనీరు లేనిపక్షంలో యిదివరకే యీమునిసిపాలిటీకి ఒక సూపర్వైజరు ఉన్నాడు. గనుక అదనంగా ఓవర్సీరు అవసరంలేదని ఒక తీర్మానంచేసిరి. తరువాత హైస్కూలులో ఉపాధ్యాయుడు శ్రీనివాసాచార్యులగారి వేతనం రూ 45/-లతో ప్రారంభించవలెనని తీర్మానించిరి.

ఈవేళ ఇక్కడ 17 రేషనింగు డిపోలలోనూ పంచదార కంట్రోలురేటుకు అమ్ముతున్నారు. తాసిల్దారు వి. మహావాచార్యులగారు 8 యూనిట్లు అంతకు తక్కువ బియ్యంతీసికొనే రేషనింగుకార్డులకు ¼ వీశ, 8 పైన్నల పైబడియుండే రేషనింగు కార్డులకు ½ వీశ పంచదార యివ్వవలెనని, రేషనింగు డిపోలకు ఉత్తరువు చేసిరి.

స్థానిక న్యాయవాది సంఘ సభ్యులు, పురప్రముఖులు తపాలాశాఖ సూపరింటెండెంటుగారిని కలుసుకొని ఎక్స్‌ప్రెస్‌లో వచ్చిన ఉత్తరాలు బట్వాడా చేయవలసిన అవసరమును టెలిఫోన్ ఎక్స్‌చేంజి అవసరము తెలుపుకొన్నారు. సూపరింటెండెంటుగారు తనప్రయత్నం చేసెదమనిరి. స్వ. వి.

## సర్వసిద్ధి తాలూకా సెట్టిబలిజీ సభ

నక్కపల్లి, నవంబరు 20: సర్వసిద్ధి తాలూకా సెట్టిబలిజీసభ ఈ నెల 16 న ఇక్కడ జరిగింది. మద్యనిషేధము అమలులోనికివచ్చినందున నిరాధారులైన గీత వృత్తి వారలకు వేవృత్తి లేక పలుపాట్లు పడుచున్నందున వారలకు ఏవైనా యితర వృత్తులు కల్పింపవలసినదని, ఖాళీభూములను వ్యవసాయం నిమిత్తం ఇప్పించవలసినదని, తాటిబెల్లం వండు పరిశ్రమను చేర్చి సహకారసంస్థలద్వారా ఆబెల్లపు కొనుబడి, అమ్మకములను జరిపించవలసినదని, ఇంకను ఇతర విధముల సహాయము చేయవలసినదని ప్రభుత్వమును కోరుచూ తీర్మానములు చేసిరి.

### కవిసన్మానసంఘము

భద్రాచలం, నవంబరు 22: ఈ పూరివాస్తవ్యులు, మహాకవి, శతావధాని, గౌతమీకోకిల, బ్రహ్మశ్రీ వేదుల సత్యనారాయణశాస్త్రిగారికి ఇక్కడ సన్మానం జరుపుటకు సన్నాహాలు జరుగుచున్నవి. నిధి వసూలుకు డాక్టరు ఎస్. వి. వి. నరసింహంగారు అధ్యక్షుడుగ ఐ. పి. వరదారావుగారు కార్యదర్శిగ, డి.ఎల్. నారాయణరావుగారు కోశ్యదర్శిగ, దారా నాగభూషణంగారు కోశాధికారిగా ఒక సంఘము ఏర్పడినది.

### ఆంధ్రాభ్యుదయ వార్షికోత్సవాలు

గుంటూరు, నవంబరు 23: స్థానిక హిందూ కళాశాలవారు ఆంధ్రాభ్యుదయ వార్షికోత్సవాలు యీనెల 27 వ తారీఖు మొదలు డిసెంబరు 4 వ తారీఖువరకు జరుపుతున్నారు. అడివి బాపిరాజు, డాక్టరు మారేమండ రామారావు డాక్టరు పుట్టిపర్తి శ్రీనివాసాచార్లు మొదలగువారు యీ ఉత్సవాల్లో పాల్గొంటారని తెలుస్తున్నది. యీ వుత్సవాలతో పాటు హిందూ కళాశాల విద్యార్థి సమితివారు ఒక కళా ప్రదర్శనం, ఫిలిం ప్రదర్శనం కూడ ఏర్పాటు చేస్తున్నారు. నవంబరు 27 వ తారీఖు ఉదయం సుప్రసిద్ధ కళావేత్తలకు సన్మానం ఏర్పాట్లు చేస్తున్నారు. (స్వ. వి.)

### శ్రీ ధన్వంతరీ జయంత్యుత్సవాలు

కవిటరం (చికాకోల్ తా॥) నవంబరు 20: ఈ గ్రామములో 18, 19 తేదీలలో శ్రీ ధన్వంతరి జయంత్యుత్సవములు పెంగిలిపురి రామమూర్తిచౌదరి పేరేపు సన్యాసిరావుగార్ల అధ్వర్యమున జరిగెను. మొదటి రోజున శ్రీ ధన్వంతరీ వ్రతము, రాత్రి తోలాపు రాజారావు భాగవతార్ గారిచే హరికథా కాలక్షేపము, రెండవ రోజున పట్రాయుని సంగీత రావుగారి అధ్యక్షతను బహిరంగసభ జరిగెను. పేరేపు వెంకట నాగభూషణంశర్మ కొప్పల చక్రపాణి స్వామిగార్లు ఆయుర్వేద వైద్య ప్రాశస్త్యంగురించి తెలిపిరి. రాత్రి శ్రీ ధన్వంతరీ ఊరేగింపుతో ఉత్సవము ముగిసినది.

# రాయలసీమలో రజకజన సభలు

## రజకులపై పన్నులు తొలగించాలని తీర్మానాలు

పెద్దకొట్టాలపల్లె నవంబరు 21: ఉరవకొండతాలూకా పెద్దకొట్టాలపల్లె ఫిర్కా ప్రథమరజక జనమహాసభ నేడీ గ్రామంలో అతిసైభవంగా జరిగింది. ఆంధ్రరాష్ట్ర రజకజనసేవాసంఘ అధ్యక్షులు శ్రీపగడాల లక్ష్మయ్యగారు, కార్యదర్శి వేమవరపు వెంకటేశ్వరులుగారు (తెనాలి) రాయలసీమ ప్రచారంలో యీమహాసభకు వచ్చారు. వారికి స్వాగతమిచ్చి పూలమాలతో ఊరేగించారు.

ఉదయంజరిగిన ప్రతినిధులసభకు అనంతపురం జిల్లా రజక సంఘాధ్యక్షుడు సి. ఆదెన్నగారు అధ్యక్షత వహించగా, ఆర్గనైజరు బి. నారాయణప్పగారు సభనారంభించారు.

సాయంత్రం 5 గంటలకు ఆం. రా. కాం. కార్యవర్గసభ్యుడు పత్తిపాటి రంగప్ప నాయుడుగారి అధ్యక్షత క్రింద బహిరంగసభ జరిగింది. పగడాల లక్ష్మయ్యగారు సభ నారంభిస్తూ రజకసంఘాల నాదరించమని ప్రజలకు విజ్ఞప్తి చేశారు. అనంతరం, వి. వెంకటేశ్వర్లు, బాలకవి సాంబశివా రెడ్డిగార్లు ఉపన్యసించారు.

### పెద్దవడుగూరులో

గుత్తి ఫిర్కా ప్రథమ రజకజన మహాసభ సందర్భంలో నిన్న పెద్దవడుగూరులో జి.వై. ఎల్లప్పగారి అధ్యక్షతను ప్రతినిధుల సభ జరిగింది. వివిధ గ్రామాలనుండి సుమారు 400 మంది ప్రతినిధులు హాజరయ్యారు. సి. ఆదెన్న, పి. సి. కుళ్ళాయప్ప, సి. సుబ్బన్నగారలు మాట్లాడారు.

సాయంత్రం జరిగిన మహాసభకు గుత్తి తా॥ కాం॥ అధ్యక్షుడు రామిరెడ్డిగారధ్యక్షత వహించారు. పగడాల లక్ష్మయ్య, వి. వెంకటేశ్వర్లు గార్లు మాట్లాడారు.

### బళ్ళారిలో

బళ్ళారిజిల్లా రజకజన మహాసభ బళ్లారిలో 18 వ తేదీన ఆం. రా. రజకజన సేవా సంఘకార్యదర్శి వి. వెంకటేశ్వర్లుగారి అధ్యక్షతను జరిగింది. ఉదయం ప్రతినిధుల సభ జరిగింది.

రాత్రి జరిగిన బహిరంగసభలో వెంకటేశ్వర్లుగారు మాట్లాడుతూ రజకు లనుభవిస్తున్న కష్టాలు, ముఖ్యంగా రాయలసీమలో, మరెవ్వరూ అనుభవించటం లేదన్నారు. తిమ్మప్ప, ఎస్. సి. లక్ష్మన్న కె. సి. సుంకప్పగార్లు కూడా మాట్లాడారు.

పై అన్ని సభల్లోనూరజకుల పై వృత్తి పన్ను, గాడిదలపన్ను లాండ్రీలపన్ను రద్దు చెయ్యాలని, ప్రతిగ్రామంలోను రజకుల సౌకర్యార్థం ఒక చెరువును రజకసంఘాలకివ్వాలనీ తీర్మానాలు జరిగాయి.

## సోషలిస్టుపార్టీ ప్రచారం

### ప్రేమభాషి ప్రసంగం

తెనాలి, నవంబరు 23: అఖిలభారత సోషలిస్టుపార్టీ సహాయకార్యదర్శి ప్రేమభాషి, కేశవఘోరె నిన్న నిచ్చటికివచ్చిరి. ఈ సందర్భంలో ఈ తాలూకా సోషలిష్టు పార్టీ వర్కర్ల సమావేశం జరిగినది. 200ల మంది వర్కర్లు హాజరైనారు. అయినం పూడి చక్రధర్‌గారు ప్రేమభాషి, కేశవఘోరెలను సభ్యుల కెరుకపరచిరి. ప్రేమభాషి సోషలిష్టు పార్టీ సిద్ధాంతాలను గూర్చి మాట్లాడిరి.

ఉత్పత్తి కేంద్రాలన్నీ జాతీయమై సంఘపరమైననాడే సోషలిజము నకు పునాది ఏర్పడగలదని, రష్యాలోగూడ నిజమైన సోషలిజము లేదనియు, కమ్యూనిష్టుల నిరంకుశత్వక్రింద అచ్చటిప్రజలు అస్వతంత్రులై యున్నారని, నిజమైన సోషలిజం రావాలంటే ప్రజల కందరికిని సమాన స్వతంత్రం తిండి, గుడ్డ, నివాసము ఏర్పడవలెనని నుడివిరి. ప్రస్తుతం ఆంధ్ర రాష్ట్రంలో తాము సంచారం చేసిన ప్రాంతాలన్నిటిలోను కాంగ్రెసు ముఠా తత్వాలతో రంగా, చంద్రమౌళి, ప్రకాశం, పట్టాభిగ్రూపులలో, పతనమై పోయినదనిరి. సిద్ధాంతాలెప్పుడూ నాయకుల ననుసరించి వుండరాదని, నాయకులుపోయినా సిద్ధాంతాలకు లోటు రానివ్వరాదని నుడివిరి. ప్రస్తుతం కమ్యూనిస్టు పార్టీగూడ కృశిభూతమైనదనియు, యీ సమయములో సోషలిష్టుపార్టీ వర్కర్లందరు జాగరూకతతో పార్టీ అభివృద్ధికై పాటుబడాలని హెచ్చరించిరి. (స్వ. వి.)

## రైలుక్రిందబడి ఆత్మహత్య

తిరుత్తని, నవంబరు 22: ఈ దినము మధ్యాహ్నము మదరాసునుండి వెళ్లుచుండిన రాయచూరు ప్యాసెంజరుక్రింద తిరుత్తని రైలుస్టేషనుకు కొలదిదూరమున పడి ఒక మనిషి ఆత్మహత్య గావించుకొనినాడు. ఈతను తిరుత్తని సమీపమున నుండెడి భరణిచాచాహ్ పురవాస్తవ్యుడను, పన్నెండుకులనుపేరి, క్షయవ్యాధితోను, మానసికముగు బాధతోను బాధపడుచుండి ఈ ఆత్మహత్య గావించుకొన్నాడని తెలియుచున్నది. (స్వ. వి.)

# "కాంగ్రెసుసంఘాలకుప్రభుత్వాలకు మధ్యసామరస్యంఆవసరం"

## రాష్ట్రపతి డా॥ పట్టాభిగారి చిత్రపటావిష్కరణ సందర్భంలో గోపాలరెడ్డిగారి అభిభాషణ

మదరాసు నవంబరు 28: కాంగ్రెసు సంఘములు కాంగ్రెసు ప్రభుత్వముల మధ్య సామరస్యము ఏర్పడు నట్లు కొన్ని సాంప్రదాయములను ఏర్పరచుట ఎంతయూ అవసరమని ఆర్థికమంత్రి శ్రీ బెజవాడ గోపాలరెడ్డిగారు నిన్నసాయంత్రం తిరువల్లిక్కేణిలో క్రిసెంటు హాలులో రాష్ట్రపతి డాక్టరు పట్టాభి సీతారామయ్యగారి చిత్రపటమును ఆవిష్కరించుచు చెప్పిరి.

కాంగ్రెసు ప్రభుత్వములు, కాంగ్రెసు సంఘముల మధ్య సమైక్యత చేకూర్చుటకు డాక్టరు పట్టాభిగారు కృషి చేయగలరని ఆశించుచున్నానని శ్రీ రెడ్డిగారనిరి.

జాతీయ చిత్రకళా మందిరస్థాపకుడు శ్రీ కె. వి. వైద్యనాథన్ ఆర్థికమంత్రికి స్వాగతమిచ్చిరి.

జనాబ్ యస్. యం. ఫాసిల్ పరిచయోపన్యాసములో డాక్టరుగారు హిందూముస్లిం సఖ్యతకొరకు ఎక్కువగా పాటుపడినవారని గొప్పమేథావియని, పెద్దలు, చిన్నలు కూడా వారిని ఆదర్శముగా పెట్టుకొనతగిన వ్యక్తి యనిరి.

"ఇండియన్ రిపబ్లిక్" సంపాదకులు శ్రీ. సి. వి. హనుమంతరావుగారు అధ్యక్షత వహించిరి.

రాష్ట్రపతి చిత్రపటమును ఆవిష్కరించుచు శ్రీ గోపాలరెడ్డిగారు ఇట్లు చెప్పిరి. డాక్టరుగారు జాతీయకాంగ్రెసు అధ్యక్షులుగా ఆమహాసంస్థ గౌరవప్రతిష్ట, అధికారములకు ప్రతీకముగా యున్నారు. అనేకఘట్టాలు గడిచి నేడు కాంగ్రెసు మహాసంస్థ అయింది. అస్పృశ్యతానివారణకు ఖద్దరు వ్యాప్తికి, హిందూముస్లిము సఖ్యతకు పనిచేసినది. ఆందోళనరోజులు పోయి పరిపాలించుదినములు వచ్చినవి. పరిపాలన విభాగమును ఆజమాయిషీచేయుటకు పార్లమెంటరీబోర్డు ఒకటి యున్నది. దానికి డాక్టరుగారు నాయకుడు కాంగ్రెసువారిలో పవిత్రతను క్రమశిక్షణను నిలబెట్టవలసిన బాధ్యత డాక్టరుగారిపై బడినది.

అయితే కాంగ్రెసు సంఘములు కాంగ్రెసు ప్రభుత్వములు ఏటికొకరు, కోటికొకరు లాగుతున్నారు. ఈ ఉభయులకు మధ్యస్పర్థ ఎక్కువగాయున్నది. రెంటినీ నడుపు వారులేకనుక ఇట్లా భిన్నదృక్పథములలో వుంటే ఎవరిని అనుసరించవలెనో ప్రజలకు కష్టమవుతుంది ఈ ఉభయులమధ్య సామరస్యము ఏర్పడుటకు డాక్టరుగారు శ్రద్ధవహించవలెను. లేకపోతే స్వపరిపాలన సాఫీగా నడువదు.

కాంగ్రెసు ప్రభుత్వములు, కాంగ్రెసు సంఘములు ఫలానావిధముగా నడుచుకోవలెననిగాని, నిర్ణీతవిధులుగాని ఏమీ లేవు. ఎవరిహద్దులలో వారుండి పనిచేసుకొనవలెను ఎన్నికలకు అభ్యర్థుల నిర్ణయములో రాష్ట్రప్రభుత్వమునకు అధికారం ఏమాత్రం వున్నదని అడుగుచున్నాను. అటువంటి విషయములు అనిశ్చితంగా వదలరాదు. ప్రస్తుతపు స్థితి ఏమీ బాగుగాలేదు. అభ్యర్థులను నిర్ణయించిన తర్వాత కాంగ్రెసు సంఘములకు అధికారమేమీ లేదు. రాష్ట్రప్రభుత్వము కాంగ్రెసువారికే గాక కాంగ్రెసేతరులకు అల్పసంఖ్యాకులకు సమాధానంచెప్పి సంతృప్తి పరచవలసియున్నది. ఇంకా అనేక బాధ్యతలున్నవి. అయినా శాసనసభకు అభ్యర్థులను నిర్ణయించునప్పుడు అధికారం ఏమీలేదు. రాష్ట్రప్రభుత్వము రాష్ట్రకాంగ్రెసు అధ్యక్షుల స్థాయిపరించి మనకేమీ తెలియదు. ఫలానా నియోజకవర్గమునకు ఫలానా వ్యక్తిని పెట్టవలెనని ప్రధాని సూచించుటకు వీలులేదు. ఈ విషయములన్నింటికీ కొన్ని రివాజులను ఏర్పరచవలెను. లేనియెడల కాంగ్రెసు బలహీనము అవుతుందనిరి.

కాలానుగుణ్యముగా జిల్లా స్థానిక కాంగ్రెసు సంఘములకు కొంత స్వతంత్రము ఇవ్వాలని అన్నారు.

రాజకీయరంగములో నేను డా॥ పట్టాభి, రాజాజీలకు కృతజ్ఞత చూపవలసియున్నదని శ్రీ గోపాలరెడ్డి గారనిరి. వారి మేథాశక్తి నన్ను ఆకర్షించినది. నాకు తెలిసిన కొద్ది రాజకీయ, ఆర్థికములు డా॥ పట్టాభిగారి దగ్గర నేర్చుకున్నవే. సమ్మతి నివాదములు చేసేవారంటే నాకు నచ్చదని అన్నారు.

జనాబ్ యస్. యం. ఫాసిల్ అభినందనలతో సభముగిసెను.

# రేడియో ప్రోగ్రాములు

నవంబరు 30 బుధవారం

## మద్రాసు (ఎ)

7-0 స్వాగతము 7-30 ఎస్. ఎల్. గానసరస్వతి వీణ 8-15 ఉదయ సంగీతము (రి) 8-30 'బి' వలె 1-40 సినీమా సంగీతము 2-10 'బి' వలె 2-45 'బి' వలె 5-30 లక్ష్మీబాయ్‌భావే 6-10 స్థానిక ప్రకటనలు వగైరా 6-20 టిప్. త్రిపుర సుందరి 7-0 గోష్టిగానం 7-30 ఎ. ఆర్. దావూద్ సితార్ 8-0 'బి' వలె 8-30 మన్నార్‌గుడి ఆర్. సాంబశివన్ 9-30 'బి' వలె 10-0 గాత్రసంగీతము (రి).

## మద్రాసు (బి)

7-0 వార్తలు 7-15 కొత్తమంగళం శ్రీనివాసన్ (రి) 7-45 'ఏ' వలె 8-30 టి. ఎన్. కృష్ణమూర్తి భాగవతార్ 12-0 కార్మికుల కార్యక్రమం 12-30 మిడిల్ మ్యూజిక్ 1-0 'ఏ' వలె 1-50 వార్తలు 2-0 గోటువాద్యము నిలయ విద్వాంసుడు 2-15 హైస్కూలుకు 2-45 కదంబము (రి) 4-0 ఎలిమెంటరీస్కూళ్ళకు 4-30 'ఏ' వలె 5-30 'ఏ' వలె 6-20 సాయం సంగీతం (రి) 6-30 గ్రామస్థులకు 7-0 వార్తలు 7-15 గ్రామస్థులకు 7-45 'ఏ' వలె 8-0 గిరికింకలు రూపకము గురజాడ అప్పారావు కన్యాశుల్కం అనుసరణ 8-30 'ఏ' వలె 9-30 సి. ఆర్. రంగనాథన్ వేణువు 10-0 'ఏ' వలె.

## విజయవాడ

7-0 వార్తలు 7-15 ఎస్. ఎల్. వసంతకుమారి 8-15 గీతావళి టి. రామకృష్ణశాస్త్రి 8-30 మద్దులపల్లి లక్ష్మీనరసింహశాస్త్రి 12-30 మిడిల్ స్కూళ్ళకు 1-0 తారాపథం (రి) 1-40 వాద్యసంగీతము (రి) 1-50 వార్తలు 2-0 గానసుధ (రి) 2-15 హైస్కూళ్ళకు 4-0 ఎలిమెంటరి స్కూళ్ళకు 5-30 మద్దులపల్లి లక్ష్మీనరసింహశాస్త్రి 6-10 ప్రకటనలు వగైరా 6-20 గీతావళి టి. రామకృష్ణశాస్త్రి; 6-30 గ్రామస్థుల కార్యక్రమం, 7-0 వార్తలు, 7-15 గ్రామస్థుల కార్యక్రమం. 7-30 చిత్రవాణి రి. 7-45 విమర్శన, కొన్నిటాకీ చిత్రముల పరిశీలన డి. వి. రమణమ్మ 8-0 ములుగు శివానందశాస్త్రి వీణ. 8-30 మారేమండ కృష్ణవేణి. 9-15 చిత్రవాణి రికార్డులు 9-30 ములుగు శివానందశాస్త్రి వీణ.

## హైద్రాబాదు

7-30 లక్ష్మీబాయి బరోడ్కర్. 8-20 ఎ. ఆర్. వెంకట్రామన్ కర్నాటక సంగీతం. 8-50 వార్తలు. 9-15 అబ్దుల్‌కరీం గీతాలు. 12-30 నూరీ బిస్మిల్లాబేన్ (రి) 1-0 ప్రయాగ రికార్డులు. 1-25 కార్మికులకు ప్రసంగం. 1-40 డి. కె. పట్టమ్మాళ్ రికార్డులు. 1-50 వార్తలు. 5-0 అబ్దుల్ కరీం. 5-15 లక్ష్మీబాయి బరోడ్కర్. 5-35 కన్నయ్యలాల్ 6-30 గ్రామస్థుల కార్యక్రమం. 7-0 వార్తలు. 7-15 గ్రామస్థుల కార్యక్రమం. 7-55 అబ్దుల్ కరీం. 8-20 లక్ష్మీబాయి బరోడ్కర్. 9-55 శ్రోతలకోరికలు రికార్డులు.

# మదరాసు ధరలు

మదరాసు, నవంబరు 28:

బంగారు - వెండి నేటి మధ్యాహ్నం 1 గంటకు వరకు 1-8 ఎక్స్చర్డు బొమ్మ సెల్సుటాక్సుతోసహా రు. 77-2-0 స్టెర్లా బంగారు తులం 116-6-0 మూసబంగారు 113-8-0 సీమవెండి తులం 100-8 (రెడీ) 174-0-0 వెండి తులం 1 కి 1-12-0

వేరుసెనగ: (581 కి 1-8 ఎక్స్ పోర్టుగిడ్డంగులు) మెషీన్ (సేల్సుటాక్సుతో సహా) బజారుకొత్తది. (కోరమాండల్) 157-0-0, 157-8-0

వేరుసెనగనూనె ఎక్స్ పెల్లర్ (స్పెషల్) డిసెంబరు డెలివరి రు. 337, 339

8 టు 5% యఫ్. యఫ్. ఎ,

కొంకాయనూనె (87 కాన్లు గల డబ్బా) ఒకటికి కొచ్చిన్ క్వాలిటీ. రు. 36-12-9, 37-8-0

ఆముదం

కాండి 500 కాసులుగలది చిల్లరగా రు 250-0-0, 250-0-0 (ఒంగోలు) రు. 280 290 (నరసరావుపేట)

పంచదార

ప్యారీ (2 అంకుర) రు. 91-14-9

Edited, Printed & Published by S. Sambhu Prasad at the Andhra Patrika Press No. 7, Thambu Chetty Street, G. T. Madras.